

"దేవదాసి"

(విష్ణువు శేషశయనుడుగా ఉండినపుడు చూపించెడి వైష్ణవ సంప్రదాయ నాట్యభంగిమ)

—చిత్రం. బి. రామకృష్ణదాస్.

ఆంధ్రసచిత్ర వారపత్రిక

★

Founder
K. Nageswara Rao

స్థాపితము
1908

★

సంపాదకుడు:
శివలెంక శంభుప్రసాద్

★

సంపుటము 55
సంచిక 7

28-10-59
బుధవారం

వికారి ఆశ్వయుజ బహుళ ఏకాదశి

★

ప్రతి వెల 25 న. పై.
సంవత్సర చందా 13-0-0

★

ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టివీధి
మదరాసు-1.


# విషయానుక్రమణిక

ముఖచిత్రం:
లలితా మువీస్‌వారి 'నాగమోహిని'లో
నిరూపరాయ్



# ఉత్తరాలు

## బహుమతి వ్యాసాలు

మీరు దసరా సందర్భములో ప్రత్యేకముగా ప్రచురిరిచిన వ్యాసములు చాలా బాగా వున్నవి. వనితలకు బాగా ప్రోత్సాహమిచ్చి వారిచే మంచివ్యాసములు వ్రాయించినందుకు మీకు నా ధన్యవాదములు. పిల్లల పోటీ కూడా చాలా చక్కగా నిర్వహించినందుకు సంతోషము. తరచుగా యిలానె పోటీ నిర్వహిస్తే ప్రతి స్త్రీ కూడా యిలానే రచన సాగిస్తుందని నా నమ్మకం.

డి. పూర్ణకళావతి,
తాడిపత్రి.

## గ్రామసీమలలో ప్రేమ వివాహాలు

ప్రేమవివాహాలువ్యాసాలను చదివాను. రచయిత్రులిరువురు కూడ ఈ నాటి సామాజికపు కట్టుబాట్లను, అందరి కష్టసుఖాలను పూసగుచ్చినట్లు విశదీకరించారు. వారికి నా ధన్యవాదాలు.

కేవలము కాలేజిలలో చదివేవారు, పెద్దపెద్ద పట్టణాలలో వున్న వారి "ప్రేమ వివాహాల" సమస్యలనే చర్చించారుకాని, గ్రామాలు, చిన్న చిన్న బస్తీలలోనివారినిగూర్చి యెవ్వరు ప్రస్తావింపలేదు.

పి. చిన్నపరెడ్డి,
చంద్రగిరి.

ప్రథమ బహుమతి పొందిన వ్యాసం "ప్రేమ వివాహాలు" చాల బాగుంది. నిజంగా ఇది ప్రథమబహుమతికి తగినదే. ఈ వ్యాసములో చివరి వాక్యాలను అర్థం చేసుకున్న వారికి, 'ప్రేమ వివాహాల' లో నిహితమైన పవిత్రభావము తప్పక గోచరిస్తుందని నా నమ్మకము.

'పంకజ్' హైద్రాబాద్.

సుబ్బలక్ష్మిగారి వ్యాసం 'ప్రేమవివాహాలు' లో భాష, భావాలు, బాగున్నాయి...యింకేం చెప్పగలను ధన్యవాదాలుతప్పితే!

—య. స. ప్రసన్నరావు,
అనకాపల్లి.

'ప్రేమవివాహాలు' అనే శీర్షికలో శ్రీ జి. పద్మావతి (బొంబాయి) గారు వ్రాసిన వ్యాసం చాల బాగుంది. విషయాన్ని అన్ని దిక్కుల నుండి పరిశీలన చేయాలని ప్రయత్నం చేశారు. వారు చెప్పినట్లు ప్రేమ వివాహం చేసుకోదలచిన స్త్రీ పురుషులు సాధ్యమైనంత వరకు తమ, తమ, పెద్దల అనుమతి పొంది వారిని ఎలాగైనా ఒప్పించే వివాహం చేసుకోవటం ఉత్తమం.

ప్రారంభంలో పెద్దలు అంగీకరించక పోవచ్చు. అయినా వారికి తగినవ్యవధి ఇచ్చి మంచి చెడ్డలు వారికి నచ్చచెప్పి వారి అనుమతి పొందటం అవసరంగా కన్పిస్తుంది. అది వారి వారి ప్రయత్నాలనుబట్టి సహనం ఓర్పులనుబట్టి ఆధారపడి వుంటుంది.

—కటారు అనంతలక్ష్మి
సత్యవతీ ప్రసాద్.
ఖమ్మంమెట్.

★

# ఆంధ్రప్రదేశ్ లో నెహ్రూ పర్యట

## పండిట్ నెహ్రూ అనబడే పెనుతుఫాన్ - ఈ తుఫాన్‌లో కొట్టుకుపోం
## జనం - ఆర్, టి. సి వాగానం - కళానికేతన్ వారి గోష్ఠి

ఏడుపదుల సంవత్సరాల వయస్సు నిండే ప్రధాని పండిట్ జవహర్ లాల్ నెహ్రూ ఎగిరి గంతులేస్తూ తిరగడం చూసినప్పుడల్లా, ఈయనకు పదేళ్ళయినా వయస్సు నిండిందా అనిపిస్తూంటుంది. ఒక్కొక్కప్పుడు ఆయన ఉపన్యాసాలు చదువుతూంటే, వింటూంటే-'ఈయన ఒక రెండు శతాబ్దాల వెనుక జన్మించాడేమో, ఇంకా రానున్న ఒకటి రెండు శతాబ్దాల ఆలోచన లన్నీ ఆలోచించేశాడేమో' అనిపిస్తుంది.

**రాజధాని కబుర్లు**
**ప్రవీణ్**

అనేక రంగాలలో నేడు పండిట్ జవాహర్ లాల్ నెహ్రూ నీడపడుతోంది. ఆ నీడలో నిలబడి ముగ్ధులైపోయే వారు గమనించలేరు. కాని బయట నిలబడేవారికి అదిఒక్కొక్కప్పుడు ప్రశ్నార్థకంలా కనపడుతుంది: అంతకంటె తరుచుగా ఆశ్చర్యార్థకంలా కనపడుతుంది.

తుఫాన్‌లా వచ్చారు ఈ వారం పండిట్జీ. శనివారం ఉదయం వరంగల్ లో దిగి ఇంజనీరింగ్ కళాశాలకు ప్రారంభోత్సవం చేశారు. గాలిలో ఎగిరి, రాజధానిలో దిగారు. గవర్నరు ఇచ్చిన అల్పాహారవిందు ఆరగించారు. నిజాం కళాశాల ఆవరణలో ప్రసంగించారు. ఒక బహిరంగ సమావేశంలో మాట్లాడి ఉదయం ఇక్కడికి ముప్పైమైళ్ళ దూరంలో ఉన్న షాద్ నగర్ లో పంచాయత్ సమితికి, అధికారుల అనధికారుల సమ్మేళనానికి ప్రారంభోత్సవం జరిపారు. ఏ రాష్ట్రమైనా ప్రయత్నించ నక్కరలేకుండా నే సిగ్గుపడ గల అతుకుల, గతుకుల బాటపై ప్రయాణం చేసి, వనపర్తిలో కృష్ణదేవరాయా పాలిటెక్నిక్ ను ప్రారంభించారు.

మరునాడు నాగార్జునసాగర్, విజయవాడ. తర్వాత చీరాల, నెల్లూరు, తిరుపతి, మద్రాసు. పండిట్ నెహ్రూ పేరజరిగే పెనుతుఫాన్ ఢిల్లీ ఆకాశం దిశ పయనించింది.

దిన పత్రికల్లో పడ్డ వార్తలను ఉటంకించడం పాఠకులు క్షమించే విషయం కాదని తెలుసు నాకు! తెలుసు నాకు మీ మనసు. కాని విధిలేకయని కూడా తెలుసుగదా నాకు? కనుక — క్షమించమని బ్రతిమాలుకుంటూ, షాద్ నగర్ లోను, వనపర్తిలోను జరిగిన సంఘటనలు ఒకటో అరో పేర్కొంటాను.

మొదట 'అర సంఘటన.' షాద్ నగర్ లో పండిట్జీని ముఖ్యంగా చూడ్డానికి, కొంతవరకు



అక్టోబరు 12 సాయంకాలం విజయవాడలో ఒక ప్రత్యేకమైన బహిరంగసభలో శ్రీ నె ప్రసంగిస్తున్న చిత్రం. ముఖ్యమంత్రి శ్రీసంజీవరెడ్డి ప్రసంగాన్ని తెలుగులోకిఅనువదిస్తు

ఆయన ఉపన్యాసం వినడానికి, పది వేలమందిదాకా జనం వచ్చారు. ఇం ముసలి, ముతక, చిన్న, పెద్ద, ఆడ, అంతా ఉన్నారు. అత్యున్నతమైన ఎక్కి ఉపన్యసించారు ప్రధాని. ఉపన్యాసం ముగించి, వందన స జరుగుతూండగా, వెనకవున్న పోస్టర లిస్తున్నారు. ఈలోగా ఒక ముదుసలి మధ్యలో నిలబడి, చే దండం పెట్టి, ఎలుగెత్తి చెప్పుకుంది. లౌడ్ స్పీ బిడలో ఆమె క గమ్యస్థానం చేర

# ★ రాజధాని కబుర్లు ★

జ్జీ చూడలేదు కానిపరిశోధనశాఖమంత్రి యూన్ కబీర్ చూశారు. పండిట్జీని ముందుకు తెచ్చారు. చూపించారు. ని కళ్లు జనాన్ని శోధించాయి. శోధన ) చూపుడువేలు చూపించింది. 'గా ఆమె సాహసం ఇగిరిపోయింది. ంకలిపి నమస్కరించింది కాని కంఠం పలకరించలేదు. అరమోడ్పు కన్నుతో ముఖం చూసి, ప్రధాని మిగిలిన పెద్దల మధ్య కలిసిపోయారు.

ఇది 'అరసంఘటన'. ఆక్షణంలో ఆమె కంఠం పెగిలితే పూర్తిసంఘటనకాగల అన్ని లక్షణాలు కలిగిన ఒక 'అరసంఘటన' (గుప్పమాపాన్ని క్షమించండి)

హైదరాబాద్ నగరంలో పండిట్ నెహ్రూ ఉపన్యాసం చక్కగా ఉంది. వనపర్తిలో ఆయన ఇచ్చిన ఉపన్యాసం అతుకుల బొంతగా ఉంది. అలసట ఆయన ఉపన్యాసంలో ప్రతీవాక్యంలోను కనిపించింది. మండు టెండలో గుమికూడిన లక్షమంది జనంపై జాలిపడి ఆయన, కార్యక్రమంలో ఉన్న విశ్రాంతిని వదులుకొని, అరగంటముందు ప్రారంభించారు ఉపన్యాసాన్ని. ఉపన్యాసం ముగియగానే, వెనక కాంగ్రెసు కార్యకర్తలు చేతులు పడిపోయేటట్టు దండలు మోసుకొస్తుంటే, పరుగెత్తుకొచ్చారు నెహ్రూజీ. కాపలాదారు పోలీసు దార్లు అనుకోకుండా దారిచ్చేశారు.

నెహ్రూ ఎత్తుగా మెట్లపై నిలబడి మంద హాసాల ధారాలతో గుచ్చిన పుష్పహారాల తుండాలను గుమికూడిన కార్మిక కర్షక స్త్రీ సమూహముపై విసరడం ప్రారంభించారు. పూలువిసరడం ఆటగాచేసుకుని, ఆడావారయ్యారాయన. పూలవర్షంలో మునిగి పుని తులు కావడంకోసం స్త్రీలు ఒకరినొకరు త్రోసుకోవడం మొదలెట్టారు. లక్షహృదయాలు వికసించాయి. పువ్వులు నవ్వుల పువ్వులమధ్య కలిసిపోయాయి. విరునిముషాలు పకాపకా నవ్వుతూ ఆడుకున్నారాయన. ఈలోగా పోలీసువాళ్లు తేరుకొని, మమ్మల్ని దూరంగా తోశేశారు; 'తోలేశారు.' మా మధ్యనుంచి నడుస్తూ, పరుగెడుతూ, మెట్లెక్కి వెళ్ళిపోయారు. నెహ్రూ మళ్ళీ దూరంగా వెళ్ళిపోయారు.

అప్పుడనిపించింది. ఏడుపదుల వయస్సు నిండుతోందనిలోకం అనే ఈయనకి పదేళ్ళయినా వయస్సు నిండిందా? అని.

* * *

## ఆర్. టి. సి. అధికారుల హామీ

రవాణాసంస్థ బస్సులు ప్రయాణీకులను సాధ్యమైనంత చౌకలో, సాధ్యమైనంత త్వరగా గమ్యస్థానాలకు చేరవేసినంత కాలం, సంస్థ ఎలా నడుస్తూందో సాధారణ పౌరులకు అవసరం ఉండదని రెండు మూడు వారాలక్రితం మనవి చేయడం జరిగింది 'కబుర్ల'లో. అందుకు సర్వ విధాలా యత్నిస్తున్నామని యత్నిస్తూనే ఉంటామని అంటున్నారు అధికారులు ఇప్పుడు.

రవాణాసంస్థ అధికారి ఒకరు సచిత్ర వారపత్రిక సంపాదకుని పేరఅక్టోబరు రెండో వారంలో ఒక లేఖ వ్రాశారు. 'పత్రిక'లో పడిన విమర్శలు గమనించబడడం లేదన్నది పొరపాటని, 'పత్రిక'లోనే కాక, పత్రికలలో పడే విమర్శలన్నీ పరిశీలించబడుతూనే ఉంటాయని ఈ అధికారి ఈలేఖలో పేర్కొన్నారు. 7-బి, 7-సి రూట్లలో



అక్టోబరు 18వ తేదీని ప్రధాన మంత్రి శ్రీ నెహ్రూ తిరుపతి వేంకటేశ్వరస్వామి దర్శనం చేసుకొన్నారు. అక్కడ అర్చనానంతరం శేషవస్త్రంతో బయటకి వస్తున్నారు. ప్రధానిగా దేవాలయంలోకి రావడం ఆయనకిది అపూర్వం.

బస్సుల రద్దీలు ఏర్పడ్డానికి మూలకారణంగా కాచీగూడా చౌరస్తా. సుల్తాన్‌బజార్ చౌరస్తాల మధ్య గల బాట కట్టబడకపోవడమే నన్నారు. అది కారణమైతే ఎంత బాగుణ్ణు? ఇప్పుడు బాట బాగుపరిచినా కనక బస్సులు - కాలానికి వస్తే—వస్తే;— ఇంకా ఎంత బాగుణ్ణు?

“క్రమబద్ధమైన పద్ధతిలో. నిర్ణీతమైన కాలానికి బస్సులను నడిపించడానికి అనేక కారణాలవల్ల అనేక అవాంతరాలు వస్తూంటాయ్. ముఖ్యంగా హైదరాబాదు, సికిందరాబాదు జంటనగరాల్లో”—అంటే ఏమిటో?—“బస్సులను క్రమబద్ధంగా నడపడాలంటే ఎన్నో సమస్యలు ఎదుర్కొనవలసివస్తుంది” అంటారు లేఖకులు. ఎదుర్కోవడానికి సమస్యలు లేకుంటే, సంస్థలు దేనికి? అధికారులు దేనికి? వాళ్ళకి జీతాలు దేనికి? ‘ప్రభుత్వాధీనం బస్ సర్వీస్’ అన్న శీర్షిక క్రింద ‘పెళ్ళి కుదిరితేగాని పిచ్చి కుదరదు; పిచ్చి కుదిరితేగాని పెళ్ళి కుదరదు’ అన్న దృక్పథమే నిర్మాణించబడింది.

ఐతే. ఒక్క విషయానికి ఆనందం ప్రకటించాలి. ఆర్. టి. సి. అధికారి ఒకరు భవదీయుణ్ణి కలిసి నగరంలో బస్సుల నిర్వహణలో లోపాలను సవరిస్తామని హామీ ఇచ్చారు. రవాణా సంస్థ విషయంలో గాని, మరే యితర ప్రజాహితసంస్థ కార్యక్రమం విషయంలో గాని, కేవలం విమర్శించడమే ‘ఆంధ్రపత్రిక’ నిర్వాహకుల ధ్యేయం కాదు. పూర్వమెన్నడూ కాదు; మీదెప్పుడూ కాబోదు. సమస్యల సత్వర పరిష్కారమే ధ్యేయం. ఈ క్రింది విషయాలలో ‘త్వరలో’ చర్య తీసుకొనబడుతుందని ఆర్. టి. సి అధికారి సెలవిచ్చారు. అవధరించండి.

(1) బస్సులు ఏయే సమయాల్లో నడవాలో, నడుస్తాయో బస్సు స్టాండులవద్ద బోర్డులు నెలకొల్పబడతాయి. చార్మినార్, అఫ్జల్‌గంజ్. కోఠీ, రాణిగంజ్, సికిందరాబాద్ స్టేషన్‌వంటి స్థలాల్లో—అంటే బస్సులు బయలు దేరచోట్ల—పూర్తి వివరాలు తెలిపే బోర్డులు వేలాడదీయబడతాయి. ప్రధానప్రాంతాల్లో—అబిడ్స్, నాంపల్లి, సెక్రటేరియట్, చిక్కడపల్లి మొదలైన స్థలాల్లో—ఎప్పటినుంచి ఎప్పటివరకు ఎంత తరచుగా బస్సులు నడుస్తాయో బోర్డులుంటాయి. ఈ బోర్డుల ఉపయోగాన్ని అర్థం చేసుకొని. బస్సులు ఆలస్యంగా నడుస్తే నిరసన తెల్పవలసిన బాధ్యత మనది—రాజధాని పౌరులది. నిరసన తెలుపకపోయినా, చర్య తీసుకోవలసిన బాధ్యత, సహజంగానే, అధికారులది.

(2) బస్సులు ఎక్కడనుంచి ఎక్కడికి పోతాయో తెలిపే ప్రకటనలు, ఇక బస్సు వెనుక భాగంలో కూడా ఉంటాయి. మోటారు వాహనాల చట్టం క్రింద చేసిన నిబంధనల ప్రకారం ఇటువంటి ప్రకటనలు వెనుక భాగంలో కూడా ఉండాలి. రాష్ట్రంలో ప్రైవేటుబస్సులన్నీ అమలు జరిపినా, ...యంగా శాసనోల్లంఘనం ఇంతవరకు చేసింది ఆర్ టి సీ యేనని వేరే చెప్పక్కర్లేదు.

(3) బస్సులో ఉచితంగా ప్రయాణం చేసేవారి సంఖ్య పరిమితం చేయబడి, అధనం వయా పైసలు చెల్లించే ప్రయాణీకులకు ముందు ఎక్కువ స్థానాలు లభిస్తా... బస్సుల్లో ఉచితంగా ప్రయాణం చేస్తూ, కాలుమీద కాలేసుకు స్త్రీలు... వులు, వృద్ధులు నిలబడాలేమని ఉద్యో... సంఖ్య పరిమితం చేయబడుతుంది. శుభం.

(4) బస్సు రుసుము తగ్గించబడత... ఆలస్యంగా ప్రయాణం చేసిన బస్సులు ...వ్యంగా చేరినట్టు రికార్డుల్లో ఇకము... నమోదు చేయబడతాయ్. ‘ఇకము...’ అంటారేమిటని ప్రశ్నించకండి. ఇం...

(60 వ పేజి చూడండి)

# ధికారులరామలీల: అమాయికప్రజలగోల!

## పురోగమనంలో 'ఫుల్‌స్టాప్'! శుచిలేని సచివాలయం!

మొన్న పదవతేదీని హైదరాబాదులో ఒక బహిరంగసభలో మాట్లాడుతూ ప్రధానమంత్రి శ్రీ నెహ్రూ 'కేవలం సరిహద్దు తగాయిదాలమీద చైనాతో భారత్ యుద్ధానికి దిగడం తప్పు' అని ఉచ్చరించారు. చైనాకు మన వైఖరి 'ఇది' — అని బాగా తెలుసు. పోతే మన సరిహద్దులు చెరపడానికి చైనా సాహసించేదే కాదు.

### రామలీల

...పవారం నిర్మాణకార్యక్రమ... ...దం. దేశమంతటా గ్రామంలో మునిగి ...వమంత్రి గతివారం పర్యటనలో ...రు. ఆయన కనేకుల 'నవభారతం!' ...తునకున్న విశేష ఆశయం. రాష్ట్ర ...డా గతివారమంతా చాలాపని తొందరలో ఉన్నారు. అక్టోబరు తొమ్మిదవ ఒకానొక భవన శంకుస్థాపనను ఆయన ...ధికారులు నిర్వహించారు. పదవతేదీన ...రిలో దుర్గపూజ ఉత్సవాలు ఆయన ...వారు. గడచిన ఆదివారం పెరేడ్ ...నంలోను, రామలీలా మైదానంలోను ..., రామలీల ఉత్సవాలలో ఆయన ...న్నారు. ఇక్కడే ఆయన రామపాత్ర ...యిన ఒక బ్రాహ్మణబాలుని నుదుట ...కూడా దిద్దారు. 12వ ...న గాంధీ మైదానంలో ...త్ మిలాప్' ఉత్సవాల ...ల్గొన్నారు. ...ల్లీలో రామలీల ఉత్స... ...మూడుచోట్ల ఘనంగా జరిగాయి. ...పతి ఈమూడుచోట్లకూ విచ్చేశారు.

### అమాయకులు

...రోజులనుంచి కార్మికమంత్రి మాన్యులు ...జీ గుల్జారీలాల్ జీ నందాజీ సాధు ...తె సంరక్షణకు సదుం ...పూనుకొన్నట్లు కను ...ది. ఒక ప్రముఖ పత్రికా సంపాద... ఇటీవల ఆయన ఒక లేఖవ్రాస్తూ, ...శంలో నేటికీ మంచి సాధువులు ...న్నారని, వారి మహిమలచేత అనేకప్రజ ...రు ఆకర్షిస్తున్నారనీ, దీనివల్ల ప్రజ ...ప్రార్థన, నియమం, కీర్తన, సత్సంగము, ...పట్ల భక్తిశ్రద్ధలు పెరుగుతు ...నీ పేర్కొన్నారు. ...జీ ప్రజలు అమాయకులని పేర్కొ...రు. ఇటువంటి అమాయక ప్రజలభక్తి ...నే ఈ సాధువులు ఉపయోగించు ...న్నారు. ఈ సాధువులను ప్రోత్సహిం...

...దసంయమాలాన ప్రభుత్వంమీద; అధికారంలో ఉన్న పెద్దలమీదకూడా అనేక విమర్శలు వినవస్తున్నాయికూడా. ఢిల్లీ రామలీలా మహోత్సవాలను, పదిలక్షలమందికి పైగా తిలకించారట ప్రజలు! అయితే ఈ 'అమాయిక ప్రజలు' తమ రాష్ట్రపతినికూడా ఆ ఉత్సవాలలో చూసి తిరిగి సాధువులయుగం వచ్చిందని తలపోస్తారు.

కాగా, సాధువులకు పాదాభివందనాలు చేస్తున్న మంత్రులను చూసినా ఇటువంటి భావాలే ప్రజలలో చెలరేగుతాయి. ఒక వైపు ఈ అమాయిక ప్రజలను నవభారత పౌరులుగా మార్చడానికి కోట్లకొలది ధనం వ్యయం చెయ్యబడుతున్నది. వారి అజ్ఞానం తొలగించి నవనాగరికతా దీపం వెలిగించడానికి కృషి




జరుగుతున్నది. ఆశయ సంస్కృతికి ఈ సాధుసమాజాలు రక్షకులు అనేమాట అనేక తర్జన భర్జనలకు లోనుగాక తప్పదు. అది విచారించవలసిన విషయం, ప్రజా దృష్టితో ఆలోచిస్తే అసలుకే మోసం తప్పదు.

### సాధు ధర్మం

ఇంతకూ ఈ సాధువులూ, యోగులూ చేయవలసింది ఏమిటి? ముక్తి సాధనకు భౌతిక బంధాలను పరిత్యజించి తపశ్చర్యలో జీవితం గడపడం! ఇది వైయక్తిక సాధన. తన మోక్షంకోసం తను చేసే సాధన. తన ఆత్మను తాను రక్షించుకోవడం తప్ప భారత దేశాన్ని రక్షించడంగాని మహత్తరమైనదిగా రూపొందించడంగాని కాదు. అందుకే ఈ 'సాధుసమాజ్' దృక్పథం కన్న ప్రధాన మంత్రి దృక్పథం విశాలమైనదీ, విశేషమైనదీ కూడా. ఈ సాధువులంతా న్యూఢిల్లీలోని కింగ్స్‌వే రోడ్డుపై ఒక పెద్దభవనం ఏర్పాటు చేసుకుంటున్నారు. ఇది వారి కేంద్ర సచివాలయం! అమాయిక ప్రజలు ధనవంతులు కొందరు ఈ భవనం ఏర్పాటు చేయడానికి ధనం నిచ్చుస్తున్నారు.

అంతే అమాయకులే కాదు, తెలివిగల వారూ ప్రజలలో ఉన్నారు. ప్రతి సంవత్సరమూ, రామలీల ఉత్సవాలకై రెండులక్షలు ఖర్చుచేయడం వారికైనా ఆశ్చర్యంగా తోచవచ్చు.

ఈ సాధువులు గానీ, రామలీలా నిర్వాహకులు గాని ఢిల్లీ యూనివర్సిటీకో మాయో యితర సంస్థకో విరాళాలు సేకరిస్తే సాంఘిక సేవ చేసినవారు అవుతారు. ప్రజలనుంచి పన్నులు వసూలు చేసిన బాపతు కోట్లకొలది ధనం సోషల్ సర్వీస్ బోర్డు కలాపాలకు పెట్టబడటం మరింత బాధాకరం!

* * *

### (వి) కేంద్రీకరణం

ప్రజాస్వామ్యపరిపాలనా వికేంద్రీకరణను ప్రధానమంత్రి శ్రీ నెహ్రూ రాజస్థాన్, ఆంధ్రప్రదేశ్‌లలో అంకురార్పణ చేశారు. ఇదే సందర్భంలో అధికార కేంద్రీకరణవల్ల ప్రజలకు ప్రభుత్వానికీ అనేక సమస్యలు ఉత్పన్నమౌతున్నవని పరిశ్రమలమంత్రి శ్రీ మనూభాయ్ ఎమ్. షా ప్రకటించారు.

అయితే శ్రీ షా యెంతవరకు వికేంద్రీకరణను పూనుకొన్నారనేదొక ప్రశ్న! మహాత్మాగాంధీ ఖాదీపరిశ్రమ గ్రామాలలో వర్ధిల్లాలని కలలు కన్నారు. శ్రీ మనూభాయ్ షా మంత్రిత్వం క్రింద అఖిలభారత ఖాదీ గ్రామోద్యోగబోర్డు పనిచేస్తున్నది. చేతిపనుల పరిశ్రమ కూడా గ్రామీణులకే చెందాలని గాంధీజీ ఆశించారు. కాగా శ్రీ షా చేతిలో చేతిపనుల పరిశ్రమల బోర్డు కూడా ఉంది. ఈ బోర్డుకు శ్రీమతి కమలాదేవి చట్టోపాధ్యాయ అధ్యక్షులు. పరిశ్రమలన్నీ రాష్ట్రాలకు కేటాయించబడినాయి. శ్రీ షా చేతిలో లఘుపరిశ్రమల కార్పొరేషన్ కూడా ఉన్నది. ఇన్ని సంస్థలు ఆయన అధికారంలో ఉన్నాయి. ఇదెక్క వికేంద్రీకరణం?

జీవనాడులు న్యూఢిల్లీలో ఉన్నన్నాళ్ళూ వికేంద్రీకరణం, పంచాయతీ రాజ్యం, రాష్ట్ర స్వపరిపాలనం అనే

వాటికి రూపం, అర్థం, విలువ కూడా ఉండనే ఉండవు. వీటికి ధనం కేటాయింపులు ఇప్పటివరకు కేంద్రం నుంచే జరుగుతున్నాయి. ఇక పంచవర్ష ప్రణాళికలు, రాష్ట్రాలకు కేంద్రం అందిస్తున్న కేటాయింపులూ వీటితో రాష్ట్ర స్వపరిపాలనమే దెబ్బతిన్నది. రాష్ట్రాలను కేంద్రం తన చేతిలో ఉంచుకొన్నది. హెచ్చుతగ్గు లేమి జరిగినా జాతీయనిర్మాణ కార్యక్రమం, లేదా అభివృద్ధి ప్రణాళికల ఖాతా క్రింద రాష్ట్రాలకు ఇచ్చే గ్రాంట్లు కేంద్రం బిగించివేయగలదు. రాష్ట్రాలకు వళ్లు తెలిసేటట్లు చేయగల సామర్థ్యం కేంద్రానికున్నది. శ్రీ షా చేసిన ప్రకటనను (వికేంద్రీకరణం.) తన విషయంలో నే ముందుగా ఆచరణలో పెట్టటం చాలా సమంజసం.

## చీ టి కీ మా టి కీ

దైనందిన పాలకవ్యవహారాలలో జోక్యం చేసుకొనడం ప్రధానమంత్రి ఎంత తగ్గించుకుంటే అంతమంచిది. అది ఆయనకు బొత్తిగా అలవాటు అయిపోయింది. పూర్వపక్షంలో పంచాయతీరాజ్యానికి ఢిల్లీ ఒక ఉదాహరణ. ఈమధ్య ఢిల్లీ ప్రజలు కొన్ని కథలు చెప్పుకుంటున్నారు. ఇటీవల ఢిల్లీలో ఒక సభలో మాట్లాడుతూ ప్రధానమంత్రి ముఖ్యమైన కొన్ని కార్యక్రమాల అమలులో జాప్యం జరుగుతున్నందుకు బాధపడి విమర్శించారట. జరుగుతున్న పని బొత్తిగా కొన్ని రంగాలలో ఏమీ లేనందుకు ఆయన తమ తీవ్ర ఆక్షేపణను అధికారులకు తెలిపారట.

జాతీయపురోగమనంలో ఈ 'ఫుల్ స్టాప్'కు ప్రధాన అధికారులే బాధ్యులని ఆయనకు కొందరు తెలియజెప్పారట. దీనికి కారణం, అసందర్భమైనవారి జోక్యమేనని కూడా నివేదించారట. అనవసరంగా అధికారుల జోక్యం మితిమీరిపోతున్నది. అటువంటి అప్రస్తుతపు జోక్యాలకు సంబంధించిన కొన్ని వివరాలు ప్రధాన మంత్రి అడిగి తెలుసుకున్నారట కూడా. అందుపై అధికారులకు తానే స్వయంగా జోక్యం కలిగించుకుంటూ వ్రాసిన ఉత్తరువుల ఫైల్ ఒకటి ప్రధానికిపంపారట. ఫైల్ తిరిగిరాలేదు. కాగా ఈకథ ఎంతవరకు నిజమో కూడా సరిగా తెలియడంలేదు.

న్యూఢిల్లీలో 'రింగ్ రోడ్' అనే పేరిటనున్న ఒక చిన్న రోడ్డు బాగుచేయడానికి ఉత్తరువులు జారీ అయినా పని జరగక, అక్కడ నివసించే పిల్లలూ, ఆడవాళ్లూ నడవడానికి అవస్థపడుతున్నారు. ఇందులో పార్టీగొడవలు, మంత్రుల జోక్యాలూ కూడా ఉన్నాయట! ఇంత స్వల్ప విషయాలలో ఈ విధమైన అన్యాయాలు జరుగుతుంటే ఇక వికేంద్రీకరణం, పంచాయతీ రాజ్యం ఎలా సాగిస్తామా అనే చింత కలుగుతున్నది.

*   *   *

## సరిహద్దు గొడవ

ఇక ఇండియా–చైనా సరిహద్దు వివాదంపై శ్రీ నెహ్రూ ధోరణి చిత్రచిత్రంగా ఉంది. చాలామంది విమర్శిస్తున్నారుకూడాను. శ్రీ చౌ–ఎన్–లైకి ప్రధానమంత్రి ఒక సుదీర్ఘమైన లేఖ వ్రాశారనీ బదులుకోసం చూస్తున్నారనీ తెలుస్తున్నది. చర్మచక్షువులతో చూస్తే భారతదేశపు వైఖరిని యింత వివరంగా వ్రాయడమెందుకో అర్థంకాదు. హైదరాబాదులో ఒక బహిరంగసభలో ప్రసంగిస్తూ శ్రీ నెహ్రూ 'కేవలం సరిహద్దు తగాదాపై చైనాతో యుద్ధానికి దిగడం తప్పు' అని హెచ్చరించారు. మన వైఖరి చౌ–ఎన్–లైకి చిరకాలంగా బాగా తెలుసు గనుకనే చైనీయులు భారత సరిహద్దులను చెరప సాహసిస్తున్నారు!

*   *   *



"మార్షల్ పథకం" అనే పేరుతో ప్రసిద్ధమైన అమెరికన్ సహాయ కార్యక్రమాన్ని ప్రారంభించి, రెండవ ప్రపంచయుద్ధంలో దెబ్బతిన్న యూరపియన్ దేశాల పునరుద్ధరణకు తోడ్పడి, ఇటీవల కీర్తిశేషులైన అమెరికన్ మాజీ విదేశాంగమంత్రి జార్జిమార్షల్.

## ఢిల్లీకి ముస్తాబు

న్యూఢిల్లీ నగరం సుందరంగా చేయడానికి విహారయోగ్యమొనరించడానికి కృషిజరుగుతున్నది. ఇందుకోసం ఒక కమిటీ కూడా ఏర్పాటు చేయబడింది. ఢిల్లీలో ఒక చక్కని సరోవరం త్రవ్వించి—పార్కులు నిర్మించాలని వీరు ఉద్దేశిస్తున్నారు. 'ఫౌంటెన్'లు, శిలావిగ్రహాలు కూడా వీటిలో నెలకొల్పాలని వీరి ఆలోచన. ఢిల్లీలో పెద్ద పెద్దవి పబ్లిక్ గార్డెన్సు ఏర్పాటుచేయాలని వీరు యోచిస్తున్నారు. ఇటీవల ఈ కమిటీ సమావేశం కూడా జరిగింది.

ఢిల్లీలో చక్కని గులాబీతోట ఒక 'బొటానికల్ గార్డెన్స్' పక్కనే పెంచటానికి వీరు నిశ్చయించారు. వీరు కొన్ని పథకాలు వ్యవసాయమంత్రికి పంపారు కూడా. పాలంవిమానాశ్రయంనుంచి న్యూఢిల్లీ లోనికి వచ్చే మార్గమంతా సుందరతరం చేయడానికి వీరు దీర్ఘంగా ఆలోచించారు. ఇందుకు మార్గంలో ఒకరకం చెట్లు పెంపకానికి ఇదివరకే ఉత్తరువులు జారీ అయినాయి.

## శుచిలేని సచివాలయం

కేంద్ర సచివాలయంలో మరీ తొక్కిడిగా తయారైపోతున్న చోట్ల ఇటువంటి పథకాలు ఈ కమిటీవారు అమలుచేస్తేబాగుటుంది. వర్క్సుమంత్రిత్వశాఖ సెక్రటరీయే ఈ కమిటీ చైర్మన్ కావడం వింతలో వింత.

కేంద్ర సచివాలయం సదేశ్య క్రిత 'స్ఫటికంలా స్వచ్ఛంగా నిగనిగలాడుతున్నది' అని వర్ణింపబడింది. నేడు ఒక 'పెంటకుట్ట'గా తయారైందంటే నమ్మండి! మాసిపోయి ముడ్డిపట్టిన గోడలు, తుడవక తుప్పుపట్టిన కిటికీ చువ్వలు, దుర్గంధం భరించరాని మరుగుదొడ్లూ, ఇవీ కేంద్ర సచివాలయమంటే. మరి ఏటా కోటిరూపాయలు భవన కట్టుబడులకు కేటాయించబడి ఖర్చు అవుతున్నాయి. కాగా పైకమిటీ చైర్మన్ ఢిల్లీ నగరం మాట అటుంచి కేంద్ర సచివాలయానికి విచ్చేస్తే, వారి మంత్రిత్వశాఖ చేస్తున్న అన్యాయాలు కొట్టవచ్చినట్లు కనిపిస్తాయి. బీదవారి ధనంతో కట్టిన భవనాలు బీదపడి ఉండటం తప్పదా?

ఒక్కమనవి. సదరు కమిటీవారికి కేంద్ర సచివాలయంలో మురికీ, దుర్గంధం చర్మచక్షువులకే కనిపిస్తాయి. కళ్ళద్దాలు వేసుకోనక్కరలేదు.

జనరల్ కరియప్ప అజమాయిషీలో సైనికార్యాలయమూ, శ్రీ ధర్మవీర అధికారంలో పునరావాస మంత్రిత్వశాఖ భవనమూ, ప్రభుత్వ కాల్ పర్యవేక్షణలో పార్లమెంటు భవనమూకూడా ఎంతమంది ప్రజలు వచ్చి చూసిపోయినా అద్దంలా ఉండేవి. మనుషులనుబట్టి పరిసరాలుంటాయి. అధికారులు క్రమశిక్షణ పట్టి అవి అలా ఉండేవి. మరి నేడో...

★



# పుష్పించిన స్నేహలత

విమలాదేవి * * *

అప్పుడే మార్చినెల వచ్చేసింది. సూర్యుడు తన ఉగ్రతని కొంచెం రుచిచూపిస్తున్నాడు. కానీ ఈ ఎండకాలం నాలుగు నెలలు అన్ని ఆఫీసులు కట్టేసినా బావుణ్ణు! ఆఫీసునుండి అలసిపోయి వచ్చాను. ఇంటికి రాగానే "అయ్యో" అనేవాళ్ళు లేరు. ఏకాకిని. ప్రాణం చల్లగాలికోసం తపించిపోతోంది. ఉన్నది సికింద్రాబాదులో. మద్రాసులోలాగ బీచ్ అయినా లేదు. కాని గుడ్డిలో మెల్ల, పేరేడ్ గ్రౌండ్సు వున్నాయి. ఇక్కడ వున్నవాళ్ళు చాలామంది ఆ మైదానంలోకి వెళ్ళి కూర్చుంటారు. కార్లున్నవాళ్ళయితే టాంక్ బండ్ కి వెళతారు. ఇటు సికింద్రాబాద్ కి, అటు హైద్రాబాద్ కి అదే బీచ్. రోజూ పెరేడ్ గ్రౌండ్సుకి వెడుతున్నానుగదా అని ఇవాళ ఏమైనాసరే టాంక్ బండ్ కి వెళ్ళాలనిపించింది. ఇంక సాయం ఎవ్వరూ లేరు. అందుకని స్నానం చేసి డ్రెస్సుచేసుకుని, అన్నీ సర్దాను. ఆ వేళ ఉత్తరాలేం రాలేదు. ఆలస్యమయినా ఎవరూ అనేవాళ్ళు లేరు. డ్రెస్సుచేసుకుని తలుపు తాళంపెట్టి బయలుదేరాను.

మాయిల్లుదాటి చాలా యివతలకి వచ్చేశాను. అప్పుడే రోడ్డుమీద కార్లు, బర్ బర్ మని పోతున్నాయి. ఒక్కొక్క కారు వెళ్ళగానే ఒక్కొక్క రకం సెంటువాసన గప్ మనివస్తోంది. చాలాగే కాలినడకను బయలుదేరినవాళ్ళు వున్నారు. ఏవో కబుర్లుచెప్పుకుంటూ జంటలు కదిలిపోతున్నారు. నేను బస్సుయెక్కాలని వెడుతున్నాను నెమ్మదిగా నడుచుకుంటూ. ఇంతలో నా కాలుకి ఏదో తగిలింది. ఏమిటా అని చూశాను. ఒక కవరు అక్కడ పడేసివుంది. తియ్యనా వద్దా అని ఆలోచిస్తూనే అప్రయత్నంగా చేతిలోకి తీసుకున్నాను. ఎవరు ఎవరికి రాసుకున్నదోగాని చాలా పెద్దఉత్తరం. ఒకవేళ ప్రేమలేఖేమో! ప్రేమలేఖయితే అంత అజాగ్రత్తగా పారేసుకుంటారా! మరి ఏమయివుంటుంది? అసలు నాకు ఇంకొకరి ఉత్తరాలు చదివే అలవాటులేదు. ఇది రోడ్డుమీద దొరికింది. ఇంకా బాగా వెలుతురుగానేవుంది. దానిమీద ఎడ్రస్ చూశాను. నేను వున్న యింటికి కొంచెముదూరం. అది ఒక శ్రీమతికి వచ్చిన ఉత్తరం. అదితీసి జేబులో పెట్టుకున్నాను. ఆ ఉత్తరం చూడాలన్న ఆత్రుతకొద్దీ టాంక్ బండ్ కి వెళ్ళటం మానేసి పెరేడ్ గ్రౌండ్సులోనే చీకటి పడేవరకు కూర్చుని దగ్గరవున్న టాజ్ కి వెళ్ళి భోజనంచేసి యింటికి వచ్చేశాను.

నేను తలుపులు తీస్తుండగా నా స్నేహితుడు వచ్చాడు. వాడూ ఇప్పుడే రావాలీ? ఒకపక్క ఉత్తరం చదవాలని చాలా ఆత్రుతగావుంది. సరె, వాడితో నాలుగుకబుర్లు చెప్పి పంపేసి, డ్రస్ మార్చుకుని మంచం మీద పడుకున్నాను. ఉత్తరం చదవటం మొదలుపెట్టాను.

"ప్రియమైన సంధ్యా!

నీ ఉత్తరం అందింది. అది చదువుతుంటే అందులో నీ అక్షరాలవెనుక నీ ప్రతిబింబమే నాకు కన్పించింది! నీవే ఎదురుగా కూర్చుని మాట్లాడుతున్నట్లు అనిపించింది. నీతో కలిసి అన్నిరోజులు గడిపాక యిక్కడికి వచ్చేటప్పటికి ఏమీతోచటం లేదు. అన్నిరోజులు కొన్ని క్షణాలలో గడచిపోయాయి. ఆమధుర క్షణాలని జీవితంలో ఎప్పటికి మరచిపోలేను సంధ్యా. రోజూ నువ్వు చేసినవన్నీ తింటూ, నీతో కబుర్లు చెపుతూవుంటే రోజులు యిట్టే గడచిపోయాయి.

సంధ్యా! నువ్వు వినేవుంటావు. సృష్టిలో తీయనిది స్నేహమేనని. నిన్ను ఏ గడియలో కలుసుకున్నానో గాని దానిని ఎప్పటికి మరచిపోలేను. నీదగ్గర వున్న కొద్ది రోజులలో మనస్నేహం మరింత పెంపొందింది. ఇంకా సన్నిహితులయిపోయాము. నిన్ను మొట్టమొదటిరోజున చూసినపుడు ఒకలాగా వూహించుకున్నాను. ఆశ్చర్యం! నా వూహలన్నీ నిజమయినాయి. నా మనస్సులో నీ రూపాన్ని, చిత్రించి దానికి కొన్ని గుణాలు ఆపాదించాను. అవన్నీ సరిగ్గా ఒక్కటైనా పొల్లుపోకుండా వున్నాయి. నిజంగా నాకు ఆశ్చర్యం సంతోషం కలిగాయి మనం యిద్దరం ఎన్నో విషయాలు మాట్లాడుకున్నాము. మన కుటుంబాల గురించి. స్నేహితులగురించి, సంఘం గురించి, నువ్వు పొరపాటున కూడా ఒక్కరిని విమర్శించి ద్వేషించలేదు. ఇవన్నీ నిన్ను పొగడటానికి రాస్తున్నాననుకోకు. నేను అనుకున్నది, నిజంగా వున్నది రాస్తున్నాను. అతిశయోక్తి కాదు. ప్రత్యక్ష సత్యం

కాలేజిలో ఏమి చెయ్యకపోయినా అలసిపోయి వచ్చేటప్పటికి బల్లమీద నీ లెటర్ చిరునవ్వుతో స్వాగతం చెప్తూ కనిపించింది. అది పట్టుకుని సరిగ్గా నా రూమ్‌లోకి వెళ్ళి జోళ్ళుకూడా విప్పకుండా చదవటం మొదలు పెట్టాను. అది చదువుతున్నంత సేపు నా ముఖంలో భావాలు చూడాలె గాని చెప్పవలవి కావని నా ఎదురుగా కూర్చున్న నా రూమ్‌మేటు అంది. నిజంగా సంధ్యా! నిన్ను "నువ్వు" అని సంబోధిస్తూ రాశానుగాని చాలా భయపడ్డాను. కాని నిజంగా నువ్వన్నటు ఏకవచనంలోనే ఆత్మీయత, అనురాగం, ఆపేక్ష, చనువు అన్నిటికి మించిన ఆనందం వున్నాయి. సంధ్యా! అసలు కొత్తవాళ్ళతో నేను వచ్చినా మాట్లాడలేను. ఏమిటో సిగ్గేస్తుంది. అటువంటిది నిన్ను చూడగానే నీతో పరిచయం చేసుకోవాలని, నీ స్నేహం సంపాదించాలని నా మనస్సు గంతులు వేసింది. మన పరిచయం ఆ వడిబజారులో జరిగింది. అనుకోకుండా మనం స్నేహితులమయ్యాము. సంధ్యా! నువ్వన్నట్లు మనస్నేహం పూర్వజన్మ సంబంధమే. నీ లెటర్ చదువుతుంటే ఎంత ఆనందం పొందుతానో నీకెలా తెలుస్తుంది చెప్పు! ఒక్కొక్కసారి ఏమీ తోచక పరుపుమీద పడుకుని ఆలోచిస్తూ వుంటాను. అప్పుడు వెంటనే నువ్వే మనస్సులోకి వస్తావు. మన స్నేహానికి ఎవరు విలువ కట్టలేరు. నువ్వు నాకు దొరకటం నిజంగా అదృష్టం. రోజూ ఎవరికో ఒకరికి నిన్ను గురించి చెపుతూవుంటాను. మళ్ళీ నిన్ను ఎప్పుడు చూస్తానా అని నా మనస్సు పరితపించి పోతోంది.

సంధ్యా! నువ్వు ఎంతో ప్రేమతో, ఆపేక్షతో పంపిన ఆ కానుక అందినది. నా సంతోషాన్ని ఎలా వ్యక్తం చెయ్యాలో తెలియటంలేదు. మాటలలో చెప్పలేను. దానిని చూస్తూవుంటే నీ ఆత్మీయత వ్యక్తమవుతున్నది. ఎన్నిరోజుల నుండో నాకది కొనుక్కోవాలని కోరిక. దానిని నువ్వు తీర్చావు. ఎందుకు సంధ్యా! నన్ను చూస్తే నీకింత ఆపేక్ష. అందరూ దానిని చూసి ఎవరిచ్చారని అడిగితే నా ప్రియాతిప్రియమైన స్నేహితురాలు యిచ్చినదని గర్వంతో చాటుతున్నాను.

నీ లెటర్ అంతా చదివి చివరికి వచ్చేటప్పటికి ఫక్కున నవ్వు వచ్చింది. మీ బాబుకి నా పేరు పెట్టానని రాశావు. నిజంగా ఎంత ఆనందించానో ఆ భగవంతుడికే తెలియాలి.

కాని ఏమిటి! నా కూతుర్ని బాబుకి చేసుకుంటావా? ఏమిటి నువ్వనేది? నాకు యింకా ఎంత అవ్వాలి! చదువు పూర్తవాలి. సంబంధం కుదరాలి. అది నిర్విఘ్నంగా కొనసాగాలి. ఎందుకంటే ఈ కాలంలో పీటలమీద పెళ్ళిళ్ళే ఆగిపోతున్నాయి. ఇవన్నీ అయినా కూతురుపుట్టాలి. అప్పటికదా! తప్పకుండా నీ కోరిక నెరవేరుతుందని రాశావు. మరి నీ కోరికను ఏ అశరీరవాణి విని తథాస్తు అందో!?"

ఈ సారి వచ్చినప్పుడు నీ దగ్గర యిం
ఎక్కువ రోజులు వుంటాను. మరి లె
రాయటం ఆలస్యం చెయ్యకు. అలా చే
వుగా నాకు తెలుసు. నేను మళ్ళీ పరీ
అయ్యాక రాస్తాను. అవి పెద్ద భూత
ఎదురుగా వున్నాయి. నువ్వు నా ఉత్త
కోసం వెయ్యి కళ్ళతో ఎదురుచూసి
నేను చూస్తూ వుంటాను. జాబుకి
ముద్దులు.

ప్రేమతో నీ శశి.

ఈ ఉత్తరం అంతా పూర్తిచేసి ఒక్క
ఈ లోకంలోకి వచ్చిపడ్డాను. అది చ
తుంటే నాలో నేనే ఏదో తెలియని
భూతిని పొందాను. అందులో యిద్దరి
స్తత్వాలు స్పష్టంగా తెలుస్తున్నా
నిజంగా వారిద్దరి స్నేహం అమృతమయ
ఒకరిపై యింకొకరికి యెడతెగని అభిమా
ఒకరిని ఒకరు గొప్పగా చూస్తున్నారు.
పేర్లు ఎంత బావున్నాయి. ఒకరు శశి,
కరు సంధ్య. నిజంగా ఆ ఉత్తరం చ
తుంటే వారిద్దరిని చూడాలనిపించి
అందులో ఒకరిని ప్రయత్నిస్తే చూడగ
వేరొకామె సంగతి చెప్పలేను. ఈ ఉ
కనపడకపోయినందుకు సంధ్య ఎంత
రిస్తోందో! అందుకని తప్పకుండా తీ
వెళ్ళి యివ్వాలనిపించింది.

రేపు వెళ్ళి ఏమైనాసరే సంధ్యని చూ
లనిపించింది. రేపటి సంగతిగురించి
చిస్తూ నిద్రపోయాను.







మర్నాడు ఆదివారం. స్నా
చేసి బయలుదేర వచ్చు
కున్నాను. ఇంకా పడుకుంటా
అంటోంది మందము. లేచి ఏం చే
అంటోంది మనస్సు. శుభస్య శీఘ్రం
పలికింది అంతరాత్మ. అంత చక్కటి
యిచ్చినందుకు అంతరాత్మకి ధన్యవా
లర్పించాను. గబగబ లేచి కాలకృత్యా
ముగించి ఆ ఉత్తరాన్ని మర్చిపోక

# ★ పుష్పించిన స్నేహలత ★

ంలో పెట్టుకుని బయలుదేరాను. ఆ కవరు 'న య్రడసు వెతుకుతూ.

చాలా రోజులనుంచి యిక్కడ వుండటం ేన యింటిని తొందరగానే తెలుసు కున్నాను. పెద్ద స్థలంలో మధ్య చక్కని చిన్న బంగళా. ముందర గేటు. ఆ గేటుమీద 'కుక్క జాగ్రత్త' అని రాసివుంది. అసలు కాంపౌండులో ప్రవేశించటమే కష్టం.



గట్టిగా పిలిస్తే బావుండదు. సరే కాసేపు అలాగే నిల్చున్నాను. ఇంతలో ఒకావిడ బహుశ సంధ్య అనుకుంటా, వరండాలోకి వచ్చి అప్రయత్నంగా నన్ను చూసింది. అక్కడ వరండాలో బాబుని నౌకరు ఆడిస్తున్నాడు. వాడిని వెళ్ళి గేటు తియ్యమని చెప్పకుండా తనే వచ్చి తీసింది. ఒక నమస్కారం చేశాను. "ఆయన లేరండీ, కాంప్‌కి వెళ్లారు. వస్తే రాత్రి రావచ్చు" అంది.

"ఆయన కోసం కాదు. మీతోనే చిన్న పని వుండి వచ్చాను" అన్నాను.

"నాతో నా? ఏమిపనండి? అయితే లోపలికి రండి" ఆమె వెనకాల అడుగులో అడుగు వేసుకుంటూ నడిచి వెళ్ళి డ్రాయింగ్ రూమ్‌లో కూర్చున్నాను. నన్ను కూర్చోమని చెప్పి ఆవిడ లోపలికి వెళ్ళి కాఫీ పట్టుకువచ్చి యిచ్చింది.

"ఎందుకండి మీకీ శ్రమ. నేనిప్పుడే తాగి వచ్చాను"

"అలా అంటే ఎలాగా, సిటీస్‌లో రోజుకి ఎన్నిసార్లు కాఫీ త్రాగవలసి వస్తుందో. మీరు వచ్చినపని చెప్పారు కాదు" అంది.

"ముందుగా మీరు నన్ను క్షమించాలి. నేను నిన్న రోడ్డుమీద వెడుతుంటే ఈ కవరు దొరికింది. దానిమీద య్రడస్ చూసి మీకు యిచ్చేద్దామని వచ్చాను. మీరు క్షమిస్తానంటే యింకొక సంగతి చెపుతాను. ఆ ఉత్తరాన్ని చదివేభాగ్యం కలిగినందుకు ఎంతో సంతోషిస్తున్నాను" అని ఆ ఉత్తరాన్ని బల్లమీద పెట్టాను. బల్లమీద పెట్టిన వెంటనే "అబ్బ! శశి ఉత్తరం!" అంటూ ఒక్కసారి హృదయానికి హత్తుకుంది. నిజంగా అది చూస్తువుంటే వారి స్నేహం కలకాలం వర్ధిల్లాలని మనస్సులో అనుకున్నాను. ఆమె వెంటనే అంది:

"మీకు ఎలా నా అభివందనలు చెప్పాలో తెలియటంలేదు. నిజంగా ఈ ఉత్తరం కోసం నిన్నంతా వెతికాను. వెదికి వెదికి చివరికి కనిపించక నిరాశచేసుకున్నాను. అలాటిది మీరు నాకు దీనిని తెచ్చిపెట్టారు. అందులో ఏమీ రహస్యాలు లేవులెండి. ఆమె ఎవరో అనుకుంటున్నారేమో నా ప్రియాతిప్రియమైన స్నేహితురాలు. ఫైనల్ ఆనర్స్ చదువుతోంది తప్పకుండా క్లాసు వస్తుంది. పేరు ముందే తెలుసుగా" అంది.

ఆమె ఉత్తరాన్ని ఆమెకు యిచ్చినందుకు ఏదో తెలియని ఆనందాన్ని పొందాను.

"ఆ ఉత్తరాన్ని చదివిన వెంటనే మిమ్మల్ని చూడాలనిపించింది. నాకు కావిడంగా పరిచయం అయినందుకు చాలా సంతోషిస్తున్నాను." అన్నాను.

"ఏమండీ! మీ పేరు చెప్పారు కాదూ."

"నా పేరు గోపాల్. ఇక్కడే పనిచేస్తు

న్నాను. అడిగినందుకు ఏమీ అనుకోకనుకుంటాను. శశితో మీ ప్రథమ పరిచయం ఎలాగయిందో చెప్పగలరా? అన్నాను.

'చాలా తమాషాగా అయింది. ఒకరోజు నేను, మా చెల్లెలు మా వూళ్ళో షాపింగ్ కి వెళ్ళాము. అనుకోకుండా శశి బజారులో కనబడింది. మా చెల్లెలు నాకు పరిచయం చేసింది. వాళ్ళిద్దరూ ఒకే కాలేజిలో చదువుతున్నారు. ఆవూళ్ళో వాళ్ళ బంధువులు వున్నారంటే వచ్చిందిట. మిగతా షాపింగ్ అంతా కలిసి చేశాము. ఆ విధంగా మొదటిపరిచయం అయిన వేళావిశేషమేమోగాని ఈ ఏడాది నుండి మా మధ్య ఉత్తరప్రత్యుత్తరాలు నిరాఘాటంగా సాగిపోతున్నాయి. శశిదగ్గర నుండి లెటర్ రావటం ఆలస్యమయితే మనస్సు ఏదోలాఅయిపోయి అసలుతోచదు. ఆత్మీయ స్నేహితులమై "మీరు"తో మొదలయిన మా స్నేహం "నువ్వు" అనే వరకు వచ్చింది," అని చెప్పింది.

"అయితే నిజంగా మీరన్నట్లు మీయిద్దరి స్నేహం పూర్వ జన్మసంబంధమే. ఇప్పుడు నాకు మీ పరిచయంకూడ అలాగే అనిపిస్తోంది." అన్నాను.

"ఏమండీ అయితే మాశశి ఉత్తరం అంతా దీక్షతో చదివి వంటపట్టించుకున్నారన్నమాట" అంది.

"నిజంగా ఆమె రాసినట్లు శీలము, సౌశీల్యం, వినేయత, ఒప్పు అవన్నీ మీలో మూర్తీభవించి వున్నాయి. ఆమె రాసినది అతిశయోక్తి కాదు" అన్నాను.

"ఏమండీ మీరు యింత కొంచెము పరిచయంతో ఆ గుణాలన్నీ నాలో వున్నాయనటం భావ్యంకాదు. మా శశి ఎప్పుడు అలాగే రాస్తుంది. నిజంగా అవన్నీ ఆమెలోనే వున్నాయి. మీ రొకసారి ఆమెను చూశారంటే మీరే ఒప్పుకుంటారు. ఎంత తియ్యగా మాట్లాడుతుందో తెలుసా. అలా మాట్లాడటం ఎవరికీ చేతకాదు. శశి మాట్లాడుతుంటే వెయ్యి కోకిలలు గానం చేసినట్లు వుంటుంది. చాలా చమత్కారంగా అందంగా మాట్లాడుతుంది. అసలామెదగ్గర నాకు మాట్లాడటమే చేతకాదు." అంది.

"మాట్లాడటం ఒక కళ. అందులోను మాటలతో సహృదయాతను సంపాదించటం గొప్పకళ. మీ మాటలు వింటుంటే మీలో ఎవరిలో చాతుర్యంవుందో తెలియటంలేదు. ఇంత చక్కని గుణాలన్నీ కలిగిన మీ యిద్దరికి స్నేహం కలగటం చాలా అదృష్టం"

"ఏమిలేదండి. ఆమె రాసినవన్నీ సత్యాలు కావు. నిజంగా ఆమె స్నేహం కలగటం ఎంతో అదృష్టం. అన్ని ఉత్తరాలలోను అలాగే రాస్తుంది. ఇంకా కొన్ని చూస్తే మీరు నిజంగా నవ్వుతారు. అందులో మొదటినుండి చివరవరకు నన్ను పొగడటమే. శశిలో ఏదో తెలియని ఆకర్షణ వుంది. శశి పొగడ్తలవలన నిజంగా గర్వం ఎక్కుతుందేమో అని నాభయం."

"అలా ఎప్పటికీ కాదు. చలించనియవ స్తత్వం మీది. అంతమాత్రంపొగడ్తకే గర్వపడతారా, మీదగ్గర ఆమెఫోటో వుందా? చూడాలని వుంది."

"లేదండి. ప్రతిఉత్తరంలోను పంపుతున్నానని రాస్తుంది. కాని పంపలేదు. ఈసారి రాస్తాను. వచ్చినట్లయితే తప్పకుండ చూపిస్తాను. చాలా ఆలస్యమయిపోయింది. శశినిగురించి మాట్లాడుతూవుంటే గంటలు క్షణాలలాగ గడిచిపోతాయి. మీకేమీ అభ్యంతరం లేకపోతే యిక్కడ భోజనం చేసి వెళ్ళాలి. దయచేసి కాదనకండి."

ఆమె అంతయిదిగా బ్రతిమాలుతుంటే కాదనలేకపోయాను. భోజనం చేసి బయలుదేరాను. ఆమె మళ్ళీ తప్పరమ్మనమంది. ఆరోజుని తలుచుకుని సంతోషిస్తూ యింటికివచ్చాను. ఎంత స్నేహితులని చూశాను. చిన్న భేదంతో గాఢస్నేహం విచ్చిన్నపోవటం చూశాను. కాని వీరిస్నే మాటలలో వ్యక్తపరచలేము. శశికి స్సులో ఒక చక్కనిరూపం కల్పి కున్నాను.

సంధ్యని మాసి అనుకోకుండా నెల దాటిపోయింది. ఆదివారం వచ్చిన వెళ్ళాలనుకోవటం, పనిఎక్కువగా వు వలన వెళ్ళటం పడలేదు. మళ్లీ ఆ వచ్చింది. ఏమైనాసరే వెళ్ళాలని నిశ్చ

బహుమతి (రూ. 12) పొందిన కార్టూన్




"నేను భీముడిపాత్రతప్ప ఇంకొకటి వెయ్యనని ఎన్నిసార్లు చెప్పాలి
చిత్రం : సి. లక్ష్మణరావు, బందరు

# స్నేహలత

...కుని సాయంత్రం బయలుదేరాను. సంధ్య ఒక్కర్తె బాబుని ఆడిస్తూ కూర్చుంది. చూసినవెంటనే గుర్తుపట్టింది.

"రండి రండి" అని చిరునవ్వుతో ఆహ్వానించింది. "చాలారోజులకు తిరిగి దర్శనమిచ్చారు"

"క్షమించాలి. ఆఫీసులో పని చాలా ఎక్కువగా వుంది. అందుకని రాలేకపోయాను. ఆయనలేరా?" అన్నాను.

"లేరండి. ఎక్కడికోపనిమీద వెళ్లారు. ఇప్పుడేవస్తారు." అంది.

"మళ్లీ మీ శశిదగ్గరనుంచి ఉత్తరాలు వస్తాయా? ఈపాటికి పరీక్షలు అయిపోయివుండాలి" అన్నాను.

"ఉత్తరం వచ్చిందండి. పరీక్షల హడావిడి కదూ. అందుకని పెద్దలెటర్ రాయలేదు. చాలా భయంగావుందిట. వాళ్లవూరు వెళ్లిపోయిందిట. అదుగో వారు వస్తున్నారు." అంది.

గుమ్మంవేపు చూశాను. పెద్దఅందగాడు కాకపోయినా మొహంలో ఒకవిధమయిన ఆకర్షణా నిర్మలత్వం కనిపిస్తున్నాయి. మనిషి చాలా శాంతమూర్తిలా వున్నాడు. నన్ను పరిచయం చేసింది.

"నమస్తే"

"నమస్తే, మీ గురించి మా సంధ్య చెప్పింది లెండి. మళ్లీ రాకపోతే ఏమయిపోయారో అని చాలాసార్లు అనుకుంది. మీకు వీలున్నప్పుడల్లా వస్తూవుండండి," అన్నాడు.

అక్కడ వున్నంతసేపు చాలా తొందరగా గడిచిపోయింది. ఆవేళ రాత్రి అక్కడే భోజనం చేసి యింటికి వచ్చాను. సంధ్య భర్తకూడా చాలా ఆత్మీయత చూపటంతో, నేను వాళ్ళయింటికి తరుచూ వెళుతూ వుండేవాడిని. శశిరాసిన ప్రతిఉత్తరం నాకు చూపించేది. వాళ్ళబాబు నన్ను మామా అని ముద్దుముద్దుగా పిలుస్తూవుండేవాడు. ఒకరోజు వాళ్ళయింటికి వెళ్ళటం జరిగింది. సంధ్య చెప్పిన మొదటివార్త శశికి ఫస్ట్‌క్లాసు వచ్చిందని. ఆమాటలు విని నేనుకూడా చాలా సంతోషించాను. నాకు సంధ్యని చూస్తే నా చెల్లెలులాగ అనిపించేది. నాకు చెల్లెళ్లు లేనిలోటు తీర్చినట్లనిపించింది.

"అయితే శశి యింకా చదువుతుందా?" అడిగాను.

"శశికి చదవాలనివుందిట. కాని పెద్దవాళ్ళకి పెళ్ళిచెయ్యాలనివుందని రాసింది. మరి చివరకు ఏమవుతుందో? మా శశి వుత్త అమాయకురాలు. నిజంగా ఎవరు పెళ్లి చేసుకుంటారో గాని అదృష్టవంతులు. అరవిచ్చిన కన్నులలోని నిర్మలత్వం, అప్పుడే విచ్చిన

మల్లెలలోని మృదుత్వం, అందాల గులాబి లోని అమాయకత మా శశిలో కనిపిస్తాయి. నాకు శశిని చూడాలనివుంది" అంది.

"ఏమి చక్కగా చెప్పారండి. మీ వర్ణనతో ఆమెని నిజంగా చూసినట్టుంది. నేనొకటి అడుగుతాను చెబుతారా? మీరన్నట్టుగా నే ఏకవచనంలో ఆత్మీయత, ఆనందం వున్నాయి గదా. నన్ను కూడ మీరలా పిలిస్తే సంతోషిస్తాను. మిమ్మల్ని చూసే నా చెల్లెల్ని చూసి నట్టువుంటుంది.' అన్నాను.

'నే నన్న మాట నిజమే. ఏకవచనంలో ఆత్మీయత, అనురాగం వున్నాయి. మీ కేమి అభ్యంతరం లేకపోతే నాకు లేదు. మీరు పేరుపెట్టి పిలవండి. బాబుకి ఎప మామయ్య అయిపోయాడు" అంది నవ్వు

'అయితే సంధ్యా, నేను నిజంగా '

(61-వ పేజీ చూడండి)

# నేటి యువచిత్రకారుల స్థితి

## ఆంధ్రులకు చిత్రకళపై నిరాదరం

ఎస్. వి, రామారావు

...ల మద్రాసులో "లలితకళా ఎకా...మీ" వారి అఖిలభారత చిత్రకళా ప్రద... ప్రారంభోత్సవము చేస్తూ. సర్. సి. ...మస్వామి అయ్యరుగారు బెంగాలీ ...కారులు, ఆంధ్ర చిత్రకారులు మన ...య చిత్రకళకు ఎంత సేవచేశారో వివ...ప్పుడు, పారవశ్యం కలిగింది ఆంధ్రుడ...నాకు. శ్రీ దామెర్ల రామారావు, శ్రీ ...వంటి చిత్రకారులు తెలుగువారికి ...ళలో తిరిగి ఆసక్తిని కలిగించి, జాతిని ...పరచి ఎంత కృషిచేసి, వారి ముందు ...వారికి మార్గదర్శకులైనారో గ్రహి... ఆ మహానుభావులసేవ సార్థకత తెలు...

వారి తరువాత యిప్పటివరకు కృషి ఇంకా చేస్తూ జాతీయంగా, అంత...యంగా ప్రఖ్యాతులైన ఆంధ్ర చిత్ర...ఎందరో ఉన్నారు. ఈ నాటికి దక్షిణ దేశంలో చిత్రకళనుఉన్నతస్థాయిలో ...తున్న చిత్రకారులు ఎక్కువగా ఆంధ్రులే కావటం మనకెంత గర్వకారణమో వూహించగలరు. అజంతా, నాగార్జునకొండ, అమరావతి, లేపాక్షి, హంపి, హనుమకొండలను మలచిచెక్కిన, ఉత్తమ చిత్రరచన చేసిన, విశ్వవిఖ్యాత ఆంధ్రకళానైపుణ్యము మనరక్తంలో మిళితమై ఇంకా ప్రవహిస్తూనే వున్నదేమో ననిపిస్తుంది. లేకపోతే ఎందుకు యిప్పటికీ ప్రపంచ విఖ్యాతి పొందుతున్నది, మన నేటి ఆంధ్ర చిత్రకారుల చిత్రరచన?

కాని వొక్క సంగతి: ప్రస్తుత భారతదేశ చిత్రకారుల పేర్లు,కనీసం ఆంధ్ర చిత్రకారుల పేర్లు మన ప్రజలలో ఎంతమందికి తెలుసునంటారు? భారత చిత్రకారులలో సుప్రసిద్ధులుగా ఎన్నికై, రాష్ట్రపతి బహుమతి పొంది, అమెరికా, ఈజిప్టులలో పర్యటించి వచ్చిన ప్రవాసాంధ్రులు శ్రీ కె. శ్రీనివాసులు గారిని, వారి చిత్రలేఖనా పద్ధతులను గూర్చి ఏమాత్రం తెలుసు? ఎనిమిది సంవత్సరాలు పారిస్‌లోను, ఇటలీలోను కృషిచేసి ఇటీవలనే మాతృదేశానికివచ్చి, ఢిల్లీ, బొంబాయి మద్రాసులలో తన చిత్ర ప్రదర్శనలను ఏర్పాటు చేసినారు. ప్రపంచ విఖ్యాత శిల్పి, చిత్రకారులు చిత్తూరునివాసి శ్రీ కృష్ణారెడ్డిగారు ఏ చిత్రకారునికి రానంత అఖండఖ్యాతిని, రాజకీయ, ముఠా, వాతావరణముతో కూడుకున్న భారత దేశ చిత్రకారులలో, విమర్శకులలోకూడ,పొంది తిరిగి వెళ్లినారు. వారి వైదుష్యాన్ని తెలుగు ప్రజలకు తెలియపర్చుకునే అవకాశంగూడ, ఈ ప్రస్తుత దౌర్భాగ్య వాతావరణంలో కరువైన విషయం పాటి చిత్రకారులు ఎరిగినదే. వారి చిత్రాల నకళ్ళను ఎంతోమంది పేరుపొందిన ఆర్టు కలెక్టర్సు కొన్నారు. మ్యూజియములు కొన్నాయి. కాని ఎంతమంది తెలుగువారు వారి చిత్రాలను కొన్నారు? మద్రాసులో వున్నప్పుడు తనతోటి చిత్రకారులతో ఒక్కచోటే కలిపివుండటం వల్ల, పాటి చిత్రకారుని కష్టం అవగాహన అయింది.

ఈనాడు ఆంధ్ర చిత్రకారులు ఇద్దరు కలిసి మాట్లాడుకోవడం, ఇద్దరి చిత్రాలు ఒక్కసారి కనులపండువగా చూచి ఆనందించే భాగ్యం ఆంధ్రప్రజలకు లేదు. ఎవరికివారే యమునాతీరే అనేవిధంగా, ప్రతిచిత్రకారుడు వారివారి అభివృద్ధిని, (ఆర్థికంగా) చూసుకునే పందడిలోనే వున్నారుగాని, వారితరువాత వచ్చిన, వస్తున్న యువచిత్రకారులకు అండగా నిలుద్దామనిగాని, కనీసం చేయూతనైనా ఇద్దామనిగాని ఆలోచనలో వున్నట్లు కనిపించదు. సాహసమైతే మన్నించాలి. నడివయసులో వున్న, నడివయసు దాటిన ఆంధ్ర చిత్రకారులు పత్రికలద్వారా తమతమ చిత్రాల్ని, తమపై వ్యాసాల్ని ప్రచురించుకోవడం జరిగింది. ప్రజలకు వారినిగూర్చి కొంత తెలిసింది. చాల సంతోషం. ఆవిధంగానైనా కొంతలోకొంత చిత్రలేఖనానికి ప్రాముఖ్యతనిచ్చింది. కాని ఇప్పుడు వస్తున్న యువతరం తెలుగు చిత్రకారులు తెలుగుదేశంలోనే బయటకు రావడానికి కష్టమైపోతున్నదే! వారి ప్రగతి



ఒంటరితనం

చిత్రకారుడు: ఎస్. వి. రామారావు

...59 అమృత్‌సర్ అకాడమీ ఆఫ్ ఫైన్ ఆర్ట్స్ అఖిల భారత చిత్రకళా ప్రదర్శనంలో ...ద్యతాపత్రం పొందిన ఈ చిత్రాన్ని, మద్రాసు ప్రభుత్వమువారు మద్రాసు మ్యూజియ...ని నేషనల్ గాలరీలో వుంచడానికై ఖరీదు చేసితీసుకొన్న చిత్రం

ఏమిటి? వారి నిత్యనూత్న విభిన్న ప్రయోగ రీతుల నెలా తెలియ చెప్పకోవాలి? వారి ముందరి చిత్రకారుల, అమూల్యానుభవాన్ని ఎలా పంచుకుని అభివృద్ధి చెందాలి? వారితో కలిసి హృదయపూర్వకంగా మాట్లాడి, వారి చిత్రపటాలను చూచి, వారి కృషిలోని మెలకువలను ఎలా తెలుసుకుని ముందుకు సాగాలి? ఇలా వేసుకు వెళ్తుంటే ఎన్నో ప్రశ్నలు కలవరపెడతాయి యువకులైన తెలుగు చిత్రకారుల్ని. ఈ నాడు వస్తున్న యువచిత్రకారులలో చాలమంది, కాలేజీలలో, యూనివర్సిటీలలో చదువుకొని, వారి జీవితమంతా కళారాధనలోనే గడుపుదామని వుత్సాహంతో, ప్రతిఫలం అంతగా లేని, ఈ చిత్రకళలో నిమగ్నులైనారు. వీరి దృక్పథం అనుభవం ఇప్పటివరకు పేరులోనున్న పెద్ద చిత్రకారుల వంటిది కాదు. ఏ శాంతినికేతనంలోనో, లేక ఏ శాంతినికేతనంలో చదివిన చిత్రకారునివద్దనో నేర్చుకున్న విద్యనే జీవితకాలమంతా సాధన చేస్తూ, పురోగమించ ధైర్యంలేని మనస్తత్వం కాదు యువతరపు చిత్రకారులది. ప్రతినిత్యం మారుతున్న నేటి ప్రపంచంలో, ఒక నిలకడ ఎక్కడ? రాష్ట్రీయ, జాతీయ దృక్పథాలను మార్చుకుని అంతర్జాతీయ దృష్టితో సమస్యలను కొలచిచూచే ఈ సమయంలో, అతి వేగంగా విదేశసంస్కృతులు, అనుభవాలు ఆపినా ఆగక దేశంలో మిళితమైపోతున్న ఈ తరుణంలో, నేటి సృజనాత్మక కళాకారుని దృష్టి పరిధి, ఎంత విశాలంగాను, వున్నతంగాను, తన దేశపు హద్దులను మీరివుంటుందో ఊహించగలరు. అటువంటప్పుడు అతని చిత్రాలు నూతనంగాను, ఇప్పటికీ వయసు మీరినా ఒకే వరవడిలో వేస్తున్న చిత్రకారుల చిత్రరచనకు, విరుద్ధంగా వున్నట్లు కనిపించవచ్చు. కాని అలా నూత్నంగా చిత్రిస్తున్న చిత్రకారులకు, ఎందుకు అలా వేస్తున్నారో తెలియచెప్పకొనడానికి మార్గమేది? వారి అనుమానాలను, తెలుగుదేశంలోనున్న చిత్రకారులను ఎక్కడ, ఎలా కలుసుకొని నివృత్తి చేసుకోవడం? కలకత్తా బొంబాయి, మద్రాసు, హైదరాబాదు మొదలగు నగరాల్లో వివిధ చిత్రకళాశాలల్లో వుత్తీర్ణులైన, అవుతున్న చిత్రకారుల చిత్రాల్ని, తెలుగుదేశంలో ఒక్కసారి ప్రదర్శించి, వివిధచిత్ర రచనారీతుల వైవిధ్యాన్ని అర్థంచేసుకునే మహదవకాశం ఎప్పుడు ఆంధ్రప్రజకు, ఆంధ్ర చిత్రకారులకు కలుగుతుంది? ఒక్కసారి ఆలోచించండి. ఇలా ఇన్ని చిత్రకళాశాలలనుండి, సంవత్సరాల తరబడి ఎడతెగక బయటకు వస్తున్న చిత్రకారులందరు ఏమవుతున్నారని ఎవరైనా ఆలోచించారా? వారు ఎలా జీవిస్తున్నారు? చిత్రకారులుగా 5, 6 సంవత్సరాలు చదివి గతిలేక మరోవృత్తి చేసుకుంటున్నారు. ఏలూరువెళ్ళితే స్థానికంగా ఒక చిత్రకారుని, విజయనగరంలో మరొక చిత్రకారుని, మరొక వూరిలో మరొక చిత్రకారుని యిలా ఎంతమందివని, ఎక్కడని చూడగలం? ఆస్థానిక ప్రజలకు వారి మధ్య పేరులోవున్న చిత్రకారుడు మినహా మరొక ఆంధ్ర చిత్రకారుని గురించి తెలియదే! కనీసం అక్కడ పేరులోవున్న ఆ చిత్రకారుడైనా, తెలియచెప్పడే! అలా ఎవరికివారే తమ తమ ప్రతిభను, అక్కడే సంతృప్తపరుచుకుంటే, రాష్ట్రమంతటా ఎలా విస్తృతపర్చగలరు వారి వారి భావాలను, అనుభవాలను?

తోటిరాష్ట్రాలన్నీ తమకు ప్రత్యేకంగా చిత్రకళా పరిషత్తులు పెట్టుకొని, ఎప్పటి నుండో ఏండ్ల తరబడి దిగ్విజయముగా కళావ్యాప్తి చేసుకుంటున్నాయి. లలిత కళా ఏకాడమివారు రాష్ట్ర ఏకాడమీలకు గ్రాంటులిస్తున్నారు. ఎంతోమంది ధనిక కళాజిజ్ఞాసులు ఉదారంగా విరాళాలిస్తున్నారు. రాష్ట్రప్రభుత్వం ఆర్థికసహాయం చేస్తుంది. ఇన్ని అవకాశాలు కల్గివున్నా ఎందుకు పెద్దచిత్రకారులు ముందుకువచ్చి, ఒక ఏకాడమిస్థాపించి కళాసేవ చెయ్యరు? ఎవరిని వారే పెద్దచిత్రకారులందరు వారి వారి అవకాశాలు, అవసరాలు తీర్చుకుంటుంటే యువచిత్రకారుల భవిష్యత్తేమిటి?

ఎప్పుడో ఒకప్పుడు ఆంధ్రలో ఎగ్జిబిషను జరిగితే అందులో పాత చిత్రకారుల చిత్రాలు పదే పదే ప్రదర్శించినవి ప్రచురించినవి ప్రదర్శించడం వారి మీదనే వ్యాసాలు వ్రాయడం జరుగుతున్నది. ఎవరినైనా క్రొత్తచిత్రకారులను పరిచయం చెయ్యడంగాని, ప్రోత్సహించడంగాని జరగడంలేదు. చిత్రకళా విమర్శకులొకరు రెండుసంవత్సరముల కొకతూరి ఆంధ్ర చిత్రకారులను పరిచయం చెయ్యడం, రాజపుత్రశైలి, మొగల్ శైలి అని వ్రాయడం చేస్తున్నారు. ఎప్పుడుచూచినా ఆయన వ్రాసిన ముగ్గురు నలుగురినిగూర్చే పరిచయం చేయడం జరుగుతోంది. మరి వారికి ఇ మంది చిత్రకారులే తెలుసో, లేక, చిత్రకారులు దేశంలో లేరనో ఆయ ప్రాయం, అర్థంకావడంలేదు. ఆం సుప్రసిద్ధ చిత్రకళా విమర్శకులు వారందరు ఏ "RHYTHM" మరియింకేనో ప్రముఖ ఆంగ్ల పత్రికల వ్రాస్తున్నారు. వారు మన తెలుగు లలో గూడా వ్రాస్తే చాలమంచిది. ఈ అపసవ్యమైన చాల చిత్రకళా విష ప్రచురితమయ్యాయి. చాలమంది కారుల్ని పరిచయం చెయ్యడం జ ఎంత సత్యమున్నదో వాటిలో వ్రాసిన జ్ఞానమెంతో చిత్రకారులందరికి తె కనుక సమర్థులైన చిత్రకళావిమర్శకులు కొని, దేశంలోవున్న వివిధ చిత్రకా గూర్చి వారి వారి ప్రత్యేక శైలిని వివరంగా వ్రాసి, తెలుగు ప్రజల లావను యినుమడింపచేస్తే బావుంటు

ఈనాటి చిత్రకారుల దుస్థితి తెలియనిది కాదు. ఎంతమంది ఒక చిత్రాలను కొంటున్నారు. ఆం ఉత్తర హిందూదేశంతో పోలిస్తే ఆం కొనేవారి సంఖ్య శూన్యం. ఎం డబ్బులేకనా? ప్రజల్లో కళాదృష్టి లే కాదు! మరి ఎవరిది లోపం? చిత్రకా అందరు కలసి కళాభివృద్ధికి కావలసి తీసుకొనకపోవడంవల్లనే, అన్యాయం తున్నది. ప్రజలు నిష్కల్మషులు. వారికి అర్థంఅయేట్లు చెప్పితే గ్రహి చిత్రకళలో ఎన్నెన్ని మార్పులు నాయో, ముఖ్యంగా ఎందుకు "మ ఆర్ట్" వచ్చిందో తెలియచెప్పాలి. రంగాలలో ముఖ్యంగా "సైన్సు"లో తితంగా జరుగుతున్న మహత్తర వృద్ధిని, ఈ మోడరన్ ఆర్టులో ఏలా

(52-వ పేజీ చూడండి)

# తెలుగు వెలుగులు-8



...వ్ లేకుండా కడవలకొద్దీ కన్నీళ్లు కురి...ంచగల తార అనిమటుకే సినీమనీషులు, ...ంబను ఒకప్పుడు మెచ్చుకునేవారు. ...త కొన్నాళ్లకి తెలిసింది; గ్లిసరిన్ ...డా తను కంట నీరు పెట్టడమే కాక, ...ి ప్రేక్షకులను శోకావహుల్ని చేయ ...జ్ఞ ఆమె సొత్తు అని అందరూ గ్రహిం...ు. ఆ తరవాత ఇంకొకటి తెలిసింది. ...ంబ కోపంవటిస్తే కథలో పాత్రలే ..., సినిమా తీసేచోట సాటి నటీ నటులూ సినిమాలో ప్రేక్షకులుకూడా భయపడతారనీ. తరవాత మరోటి తెలిసింది. కన్నాంబ మాతృవాత్సల్యం ప్రదర్శిస్తే ముగ్ధులు కాని ప్రేక్షకులుండరు అని. బహుశా ఆమెలో నిజమైన నటనా ప్రజ్ఞ ఉన్నందువల్లనే ఆమె గ్లేమర్ స్టార్ కాలేకపోయి ఉండాలని చాలా మంది అంటూ ఉంటారు.

సినితారా పథంలో ఆమె స్థానం ఎక్కడ వున్నా నటిగా ఆమెది ధ్రువస్థానం.

సినీలోక భ్రమణంలో వెళ్ళ గలిగినంత ఎత్తుకు వెళ్ళాక, అక్కడనుంచి దిగిపోవడం సాధారణం. ఎవరో కొందరే అలా స్థిరంగా నిలబడగలరు. కొందరే, అటు ప్రేక్షకుల అభిమానంతోపాటు ఇటు సాటి నటీనటుల గౌరవమూ సంపాదించి నిలుపుకోగలరు. కన్నాంబ 24 సంవత్సరాలుగా ఈ అరుదైన స్థానంలో నిలచింది. వయసుతోపాటు మనిషి పెరగకుండా తరగకుండా, ఎప్పుడు ఒక్కలాగే ఉండడం కూడా సినిమా ప్రపంచంలో బహు అరుదు. కన్నాంబను సెట్ మీద చూసినవారు ఈవిడ నానాటికీ పెద్దవుతోందా చిన్నదవుతోందా అని విస్తుపోతూ వుంటారు.

తెలుగు నాటక రంగస్థలం మీదా సినిమాలోనూ గడించిన అనుభవంతోను, కొన్నాళ్లు కష్టపడి నేర్చుకున్న తమిళంతోను కన్నాంబ ఈనాడు తమిళ చలనచిత్ర ప్రపంచంలో కూడా గౌరవనీయమైన స్థానం ఆక్రమించుకుంది. ఆమె విగ్రహం, మాటతీరూ కూడా కావాలంటే పదహారణాల దక్షిణాది ఫక్కీలో కుదురుతాయి ఆమెకు.

తమిళ చిత్రాలలో, ఆమె నడిపిన కణ్ణగి పాత్రకు, చాలా గౌరవం ఉంది. ఒకనాడు దామెర్లటిపక్కన రంగూన్ రౌడీలో ప్రభావతి పాత్రకు, హరిశ్చంద్రలో చంద్రమతికీ, తెలుగు దేశంలో లభించినంత గౌరవం ఇక్కడ ఈ పాత్ర నిర్వహణ పొందింది. ఈరోజున తమిళ నాడులో, ఆదర్శమాతకు రూపకల్పన కన్నాంబను చూసే చేస్తారు. ప్రజ్ఞ కొద్దిపైకి వచ్చిన వారి పేరుమటుకు వాడుకునేవారు అక్కడా ఇక్కడా ఎక్కడా ఉంటునే వుంటారు. ఆ కారణంగా కన్నాంబ ఒకొక్కసారి తలాతోకా లేని పాత్రలు ధరించవలసి వస్తోంది. ఉన్నపళంగా పాత్రలో కరిగిలీనమై పోవాలన్న దురభిప్రాయాలూ అపోహలూ లేని నటి కాబట్టి, ఆమె, తగని భూమికను చేపట్టినా దాని పక్కన నిలబడి చాతుర్యంతో, సముగుల స్థైర్యంతో దానిని ఉద్ధరించి, తీరుగా నడప గలదు. అయితే ఇటువంటి ప్రజ్ఞ ఉన్నదన్న ధీమాతో తరచుగా ఆమె ఆ ప్రజ్ఞను పరీక్షకు పెటడం తగదు. తన ప్రజ్ఞకు తగిన వాటినే ఎన్నుకోవడం మంచిది; వాంఛనీయం. ★

సుడిగాలిలా పరిగెడుతోంది. శివాలెత్తినట్టు ఊగిపోతోంది.

ఏవిటే చుక్కా అన్నారు మునసబుగారు.

నా యనోయ్ నా కొంప ముంచా డయ్యోయ్. అంది చుక్క అని వెనక్కి తిరక్కుండానే పరుగు సాగించింది కాలవొడ్డు వేపుకి.

సుడిగాలి వెనకాల అకలములా వస్తున్నాడు చుక్క తమ్ముడు. చింపిరిజుట్టు, శాన బొజ్జ ఎగరేసుకుంటూ, చిన్న చిన్న అంగలతో అడుగులేస్తూ.

ఈరిగా ఇల్రా. అరు. చుక్కెవిటిలా పరిగెడు...

పకీర్నొగ్గేశారంటండి పోలీసోళ్లు. ఆడు మూడు గంట్లకొరు కొచ్చేత్తన్నాడు. తిలపులు మానని సంపేత్తాడంటండి. అని ఏడున్నా పరిగెత్తాడు ఈరిగాడు అక్క, చుక్క వెనక. మునసబుగారు పూర్తిగా మేలుకున్నారు. పిల్లాడి మాట పూర్తిగా బుర్రలో నాటుకునే వరకూ ఆయన అయోమయ సితిలో పడిపోయారు.

పకీర్నెవరొగ్గేశారు? ఎలా ఒగ్గేశారు? కేసు పూర్తికొందే ఇది ఎలా జరిగింది? పకీరుగాడు ఊళ్ళోవచ్చిపడితే ఈ సారి ఊరు వల్లకాడవడం ఖాయం. అందరికన్న ముందు తిలపుల్ని కాలికిందేసి నల్లినలిపినట్టు నలిపేస్తాడు వాడు. కండ కండలుగా తరిగి కాకులకీ, గద్దలకీ ఎగరేస్తాడు. రెండేళ్ళక్రితం సంకురాత్రి పండగలికి కోడి పందాల్లో ఓడినందుకు ఉక్రోషం వేసుకొచ్చి చూస్తువుండగానరసయ్యని అక్కడికక్కడే నలిపి చంపేశాడు. అంతా అక్కడే గుడ్లప్పగించి నిలబడిపోయారు. ఒక్కడికీ అదేమనడానికి దమ్ములు చాలకపోయాయి. సాక్ష్యానికి మనుష్యుల్ని పోగేసుకు రాబోయేసరికి ప్రాణం పోలొచ్చింది.

పకీరుగాడు పరమ కిరాతకుడు.

బాబోయ్ కొంపలు మునిగినయ్యండీ అంటూ వచ్చాడు ముత్యాలు.

పకీర్నొగ్గేశారంటగా. తిలుపులెదవ ఒటు కులో పచ్చేట్టున్నాడండి. ఏందారి అన్నాడు.

మునసబుగారు గయ్యమన్నారు ఒక్కసారి.

ఏవుంది. ఒకటేదారి...అపలాణ్ణి సాక్షాని కొళ్ళమన్న దెవడంట. యదవలు. ఒక్కడు ముందర చెప్పినట్టినడు: ఆ మాత్రం మగసిరి ఇంకోడికి లేదనే బయల్దేరాలేం యదవ. ఇప్పుడేడిచేం లాభం అన్నారాయన.

ముత్యాలు మాటాడలేదు. తలొంచుకు నిలబడ్డాడు.

మునసబుగారు కండువా భుజాన వేసుకుని కరణంగారింటికి బయల్దేరారు. నరిసిరెడ్డిని కేకేసుకురా. కరణంగారింటి కాడుంటానని చెప్పు అన్నారు.

ఆరక్కడే వున్నారండి అన్నాడు ముత్యాలు.

ముత్యాలమ్మ గుడిముందులోనే శివాలు వినిపించాయి మునసబుగారికి. ఇంకో అడుగేసేవరకూ గుడిదగ్గర గణాచారి ఉగ్రంగా ఊగిపోతోంది. తలుపులు నేలబారుగా సాగిలబడి దండాలెడుతున్నాడు. చుక్క చతికిలబడి, నెత్తికొట్టుకుంటూ శోకన్నాలెడుతోంది.

తలుపులు పెద్దపెళ్ళాం సావాలు ధైర్యం చిక్కబట్టుకు గణాచారిని ప్రశ్నడుగుతోంది. మునసబుగారు అగదల్చుకో లేదు కాని, అంతకితంవరకూ గణాచారి గాబోలు బాగుచేస్తున్న కందుల్ని కాకులు దినిపోతుంటే, హుష్ కాకి అన్నాడు.

సాగిలపడున్న తలుపులు తలెటు దిప్పి చూసి, బొరుమని ఏడుస్తూ మునసబుగారి కాళ్ళు చుట్టేసుకున్నాడు.

నాన్నగారోయ్ నను సంపేత్తాడండోయ్. ఆడొచ్చేత్తన్నాడండోయ్ అని భోగున ఏడవసాగాడు. మావోయ్ అని చుక్క బావురుమంది. గణాచారి ప్రశ్న జెబుతూనే ఉంది...

మునసబు గిరీకొచ్చాక నాయుడుగారు చాలా చూశాడు ఇలాటి సందర్భాలు. బడితెల్లాటి మొగసిరులు బావురుమని ఏడవటం ఆయన కొత్తగాదు. గాని తలుపులు ఎన్నడూ ఏడవగా ఆయన చూళ్ళేదు. సన్నగా బక్కపలచగా పొట్టిగా ఉన్నా, పదితిసే సత్తా లేకున్నావాడు ఎన్నడూ జంకూ గొంకూ ఎరగడు—దేనికైనా ఎగబడే రకం. ఎదురుదెబ్బ తినక అలా మిడిసిపడుతున్నాడని అనుకుంటూ వచ్చాడు మునసబుగారు. తలుపులలా కంటతడిబెడితే ప్రాణం జేజారిపోయింది మునసబుగారికి. కంఠం బిగించుకుపోయింది. అందుకనాయన మాటాడకుండానే తలూపి కరణంగారింటి వేపు బయల్దేరి వెళ్ళాడు.

సావిట్లో అంతా సందడిగా ఉంది. కరణంగారూ, వారి పట్నపల్లుడూ, ప్రెసిడెంటు నర్సిరెడ్డి, ఇంకిద్దరు మెంబర్లు, జనాభా లెక్కలు రాసుకోడానికొచ్చిన ఓ దొరటోపీ మనిషీ రెండు భాషల్లో మూకుమ్మడిగా ఏకటాకీన ఖూనీ కథలూ, బ్రహ్మరాత కర్మసిద్ధాంతం, ఆ బాపతు వేదాంతం వాళ్ళ చిన్ననాటి ముచ్చట్లు, నేతిబీరకాయలో నెయ్యుండని వైనం, అమెరికాలో గాంగ్‌స్టర్లు ఖూనీలుచేసే శిల్పం (అల్లుగారిది), పకీరుగాడి పట్టుపూర్వాలూ, తలుపులుగాడి రెండో పెళ్ళాం చుక్కకీ మధురశిల్పాలలో అచ్చరలకీ పోట్లొచ్చినట్టు కనబడే పోలికలు (ఎవరో తెలీదు) ఖూనీలు కామాపుజేసేవాళ్ళ కథలూ చెప్పుకుంటూ, హాతాత్తుగా దయచెయ్యండి అన్న ఒకమాటని మాత్రం ఏకగ్రీవంగా అన్నారు.

తరవాత, జరిగిన కథను సమీక్షించి కర్తవ్యం గురించి నిశ్శబ్దం తీవ్రంగా ఉపన్యసించింది.

కరణంగారు గొంతు సవరించుకున్నారు. ప్రెసిడెంటుగారు అనుకరించారు.

అసలువాణ్ణెలా వదిలేశారూ అంట, అన్నారు మునసబుగారు.

మరి. కేసుపూర్తిగాందే అసలూఅన్నారు కరణంగారు.

పారిపోయుండాలఅన్నారు ప్రెసిడెంటుగారు.

ఇంపాసిబుల్ అన్నాడు దొరటోపీ ఆయన.

కరణంగారి అల్లుడు సాహసించి కలగజేసుకున్నాడు. వై నాట్. అమెరికాలో జైళ్ళలాటి వాటినే తప్పించుకుంటారు. అక్కడ—

ప్రెసిడెంటుగారి చూపు చూసి ఆగిపోయాడు కరణంగారల్లుడు.

నే సెలవు దీసుకొంటానండి అన్నాడు దొరటోపీ ఆయన.

తలుపులు గాడి ప్రాణానికి ముప్పే అన్నాడు ముత్యాలు.

వాడి పెళ్ళం ఒకటె ఏడుపు పాపం. కట్టుకుని ఆర్నెల్లు కూడా తిరగలేదింకా అన్నాడొడో పెద్ద ఆర్నెల్లుతిరిగితే ఫరవా లేదన్నట్టు.

సార్ జనాభా లెక్కలో జనసంఖ్య ఎంత రాసుకున్నారోగాని, ఒకటి తగ్గించి ఖర్చు రాయిచ్చు అన్నాడు అల్లుడుగారు విట్టీగా అని చుట్టూ చూసి నవ్వబోయి కొయ్యబారి పోయాడు.

బాబూ కాఫీఅయినట్టుంది. ఇంట్లో పిలుస్తున్నట్టున్నారు చూడు అన్నారు కరణంగారు బాధగా.

* * *

ప్రెసిడెంటుగారు జనాభా లెక్కలాయన్తో మాటాడుతూ సాగనంపబోయారు.

ఇగతా వాళ్ళు ఆలోచనలో పడిపోయారు. పకీరు మూడుగంటల మెయిలు కారుకి దిగుతాడన్న వార్త అందరికీ తెలుసు. ఏలూరు బెజవాడ కారులా టైము పరిగెడుతోందనీ తెలుసు.

ఐదు నిముషాలయేసరికి చుక్కా, తలుపులూ వచ్చారు.

నాన్నగారోయ్ నాకేం దారి చెప్పండన్నాడు తలుపులు ఏడుస్తూ.

ఏ నాన్నగారూ ఏదారీ చెప్పలేదు.

అసలు నీకెందుకురా గోల, నువ్వెందుకు సాక్ష్యమిచ్చావు పకీరుతో తాలగాట. వేవిటి.



# సాక్షి



అదీ ఖూనీ కేసులో! మాకామాత్రం దమ్ము లేక నే—అన్నారు కరణంగారు.

సర్లెండి అదంతా ఎందు కిప్పుడు. అది మొఖానలా రాసిపడేసుంది గావాల. కుదురుగా ఇంటికాడెలాగుండగల్డూ...అన్నారు మునసబుగారు.

ఊళ్ళో యిందరున్నారు జెమాజెట్టిల్లాంటి వాళ్లు. ఇందరు కలిసి పట్టపగలు ఒక్క పకీరుగాడికి అడ్డపల్లేరా అనిపించింది ఎవరిమటుకు వాళ్ళకి. ఆ మాటే చుక్క పైకి అనేసింది.

అవున్నాన్నగోరు. ఆడురాగానే బెడి త్తిరగేసీ—అన్నాడు తలుపులు.

భఫ్ నువ్వూర్కో ఇలాటె దవాలోచన్లు జేసే ఇంతకి దెచ్చురున్నావు అన్నారు మునసబుగారు.

మునసబుగారి మనసు ఆయనకన్న ముత్యాలుకు బాగా తెలుసు. ఇలాటె సమయాల్లో అతనేటికా తాత్పర్యాలూ భాష్యాలూ చెబుతాడు. ఇపుడూ నమ్మినబంటుగా ఆ పని చేశాడు. పకీరుది పాముపగ అని వెల్లడించాడు. పాముతో చెలగాటాలు మంచివి కావన్నాడు. పకీరుగాడు—ఇవాళ నలుగురడుపడితే తగ్గినా ఆనక నలుగురి పనీ విడివిడిగా పడతాడు. పారుగూరెళ్ళి అక్కడివాళ్ళని చావదన్నీ, చంపీ రాగల మొనగాడికి పలుకుబడి ఎంతుండాలీ?...

* * *

మరిపుడేటిచేదారి ఏటిదారీ? అన్నాడు తలుపులు.

దారికేటుంది. ఎవడిదారాడిదే. నన్నడిగితే ఆడలా మెయిలు కొరుదిగేతలికి నువ్విట్నుంచిలా పొలాల కడ్డబడి పో. లేదా పడవెక్కి పట్నానికెళ్లిపో. ఆనాక మేవంతా ఆడికి నచ్చచెబుతాం. సల్లబడ్డాక మెల్లంగ రావచ్చు. అన్నాడు ముత్యాలు.

వాడు శాంతించకపోతే అదే పాయని, పట్నంలోనే స్థిరపడిపోవచ్చునని సలహా చెప్పారు కరణంగారు. పట్నంలో లాండ్రీ పెడితే సుభ్భరంగా నెలకొంద రూపాయలు కళ్ళచూసి మారాజులా గుండచ్చునని కూడా ఆశపెట్టారు.

తలుపులికి మనసు కొద్దిగా స్థిమితపడుతోంది. కొంచెం కుడీ ఎడమా ఆలోచిస్తున్నాడు. ముత్యాల్లాంటివాళ్ళిద్దరు తన కెడాపెడా నిలబడి, కర్నం మున్నబులూ పంచాయతీ ప్రెసిడెంటూ వెనక నిలబడితే చాలు. పకీరుగాడికి దర్జాగా ఎదరపడవచ్చు.

ఏటేస్ పల్లకుండావు. ఎల్లదల్చుకుంటే చేగిలగెత్తు అన్నాడు ముత్యాలు తమాషాగా చుక్కవంక చూసి నవ్వి. తలుపులు చుక్కవంక చూశాడు. తల కొట్టేసినట్టయింది.

బతికుంటే బలుసాకేరుకు దినొచ్చన్నారు కరణంగారు.

అవును మావా అంది చుక్క కళ్ళొత్తుకుంటూ.

తలుపులు చుట్టుచూసి ఎడవసాయాళ్ళు. యదవకొడవ నోళ్ళు అనుకున్నాడు.

మంత్రాలు సతుకుతున్నావా. పకీరుగాడు జడిసేరకం కాదు అన్నాడు ముత్యాలు.

నువ్విలాగుండెస్' అన్నాడు తలుపులు చిరాగ్గా.

ఓరబ్బో. కోపం వచ్చింది దొరగోరికి—ఆ డొచ్చి మక్కె లిరగదంతే దిక్కేలేదుగాని నేను మాటంటే గుబులేం.

మావా నివ్వలాగూరుకో ఆడితో నీకేటి. నాన్నగారేం జేయమన్నారూ, నివ్వేటి సెయ్యాలా అచ్చాడు ముంగలఅంది చుక్క.

కరణంగారు మునసబుగారు 'ఒక్కమారే బరువుగా నిట్టూర్చారు. అనింది కేముంది గనక. పకీరు పరమదుర్మార్గుడు. అన్నిటికీ తెగించినవాడు. వాడికి అడ్డపడిందికి ఆలుబిడ్డలున్నవాడెవడూ ముందుకురాడు. అంచేత తలుపులు, ప్రాణాలమీద ఆశవుంటే తక్షణం వెళ్ళిపోడం మంచిదని వారభిప్రాయపడ్డారు.

తలుపులు మరోసారి ఆలోచించుకున్నా ఊరొదిలి పోబుద్ధికాలేదు. ప్రాణభయం ఎంత పీకుతున్నా కొంపా గోడూ వదులుకుని పారిపోడం వాడికి అవమానంగా తోచింది. పకీరుగాడు తల్చుకుంటే ఎక్కడున్నా తరుముకురాగలడు. తప్పకుండా తల్చుకుంటాడుకూడా.

వా బాబు, నాబాబు బాబు ఈడనే పుట్టి ఈణ్ణే మట్టిలో గలిశారు. నేనెందుకు పోవాల నేనేం ఖూనీజ్జేశానా అన్నాడు.

కరణంగారు నవ్వారు. ఇదెప్పట్నుంచి రోయ్ దేశభక్తి. ప్రాణమ్మీదికి ముంచుకొస్తూవుంటే ఈ వేదాంతం ఏమిటి. నీ బాబూ ఆడిబాబూ ఖూనీకేసుల్లో సాక్షిలిచ్చి పీకలమీదికి—

ఎవరదీ అన్నారు మునసబుగారు వాకిట్లో కొచ్చిన మనిషిని చూసి.

నేనండి ఎర్రెంకన్నని. తలుపులుగాడింకా ఈణ్ణే ఉన్నాడాండీ, అయిబాబో! పకీర్నొగేశారండి. ఆడొచ్చి సంపేత్తాడండియ్యాల...ఊరంతా:

అదనోయ్. పారిపొమ్మంటే—అవును గాని నికెవరు జెప్పారిది. వదల్దం నిజమేనా అని.

ఎవరేటండి దాన్నడగండి. ఆ చుక్కకే తెల్సు. ఇందాక పన్నెండుగంటల కారుకి డైవోరు రెడ్నాయుడే సెప్పాడంటండి.

# ★ సాక్షి ★

అదే మేం ఊరొదిలి పొమ్మంటున్నాం. వాడు కాదంటే—

ఇంకేడికి పోతాడండి. ఈ ఖబురు అందరికీ తెల్సిపోయింది. ఆడి మనుసులు ఈడు ఊరొదిలిపోకుండా కాలవ కాడ తోపుకాడ పుంతినకాడా కాపేశారంటండి. ఆడు మూడుగంటల కారుకొచ్చే తన్నాడంట.

నాయనోయ్ అంటూ చుక్క ఏడుపు లంకించుకుంది. చూస్తూండగానే తలుపులికి ముచ్చెమటలు పోసేశాయి. గజగజ వణికిపోయాడు. రెండు చేతుల్తో తలపట్టుకు కూలబడిపోయాడు. కళ్ళు తిరిగిపోయాయి.

"నాతల్లి ముత్తేలమ్మో" అంటూ చుక్క వొళ్ళోకి ఒరిగిపోయాడు.

* * *

అయితే ఏం చేద్దాం అన్నారు కరణం గారు.

మునసబు గారు మాట్లాడలేదు.

చేసేదేముంది, ఎవడి ఖర్మ కెవరు కర్తలు. అటుకోరటు వాళ్ళలా మంచీచెడ్డా లేకుండా ఖూనీకోర్లని దేశంమీద కొదిలేస్తుంటే చేసేదేవుంది అన్నారాయన మళ్ళీ.

మునసబు గారు గొంతు సవరించుకొన్నారు. చిన్నా పెద్దా మనమంతా కల్సి ఆడూళ్ళో దిగ్గానే అడ్డంపడితే...అన్నారు.

కరణం గారు తల తాటించారు. మీరేమన్నా అనుకోండన్నగారూ, నాకా సాహసం లేదు. కొంపగుంపనాశనం చేసుకోదల్చిస్తే తప్ప—

మునసబుగారు ముత్యాలు కేసి చూశారు.

అవును బాబూ. ఆడిది పొంపగ. తెగించినోడు. ఆడేదో అగాయిత్తెం జేశాక ఆణ్ణి మళ్ళా జైల్లో యేసేం, సంపేం లాబం. ఈ యెదవ జేసిన తప్పుకి మనవా కొనుకోటం. సునకొద్దు బాబూ, అసలాడి సేతికింద మణుసు తెలాటెలాటో మీకు తెల్దు. నత్తా బాబూ పనుంది. అంటూ ముత్యాలు విసవిస నడిచి వెళ్ళిపోయాడు.

నత్తాను బాబో దండాలు అంటూ వెర్రెంకన్న కూడా వెళ్ళిపోయాడు.

దారుణం. ఇది ఊళ్ళో అడివో నాకు తెలీటంలేదు. ఇందరం ఉండి ఒక్కడి ప్రాణానికి అడ్డుపళ్ళేకున్నాం. అన్నారు మునసబు గారు లేస్తూ.

ఏం చేస్తాం......పోనీ పోలీసు ఠాణాకి కబురంపండి మనిషినిచ్చి...వస్తా. అలుడూ అమ్మాయి సినిమాకోయ్ అని గోలబెడుతున్నారు. మాయాబజారుట ... మీరూ వస్తారా అన్నారు కరణంగారు.

రాను అంటూ వెళిపోయారు మునసబు గారు. సందు మలుపు దిగాక కండువతో కళ్ళొత్తుకుని ఇల్లుచేరి పడక్కుర్చీలో కూలబడ్డారు.

కరణంగారు, చుక్కకి ధైర్యం చెప్పారు తలుపులికి స్పృహే వున్నట్టులేదు.

రాగానే మీసపుతులిద్దరు వాడికాళ్ళమీద పడండి. అంతకన్న మార్గంతోచట్లేదు అన్నారాయన.

* * *

చుక్క, తలుపుల్ని లేవదీసి నెమ్మదిగా ఇంటికి బయల్దేరింది. సెత్తిన ఎండ పేలిపోతోంది. కష్టకాలంలో దురదృష్టంలా వడగాడుపు బలంగా దబ్బమీద దెబ్బ కొడుతోంది.

తలుపులికి ఒళ్ళు మసిలిపోతోంది. కళ్ళు మూసుకునే చుక్క నానుకు నడుస్తున్నాడు చుక్కకి పెదిమలు తడారిపోయాయి. గొంతు మండిపోయింది. అమ్మవారి గుడి దగ్గర ఆగి, గండం గడిచి తెల్లారితే ఉపారాలెత్తుతాను తల్లీ పెట సేయిత్తానమ్మా అని దండం పెట్టుకుంది.

* * *

ఇల్లుచేరి గుమ్మంలో అడుగెడుతూండగా, ఆశ తోడిగిందికరణంగారి కమీజంట గాదూ. ఎందుకన్నా మంచిది ఇప్పించేసేయ్ అని చెప్పివెళ్ళిపోయాడు కరణంగారింటిపాలేరు.

థూ అని ఉమ్మేసింది చుక్క. లోపల సవితి చామాలు పడుకుని ఉంది. అంపకం పాలతో జ్వరం వచ్చేసింది పాపాలుకు. కలవరింతలు, కేకలు. చుక్కకి దుఃఖం పొంగి వచ్చేసింది. తలుపుల్ని మంచాన పడుకోబెట్టి దుప్పటి కప్పింది. పాపాలు కణతలంటి చూసింది.

నా కొంప ముంచావే నాయనో అంటూ గోల్లుమంది పాపాలు. ఏ సేత్తాం. అన్నిటికా పల్లినల్లుండాది. ఈ గండం గడిత్తే శ్రీపుపారాలెత్తించి పెట్టనేద్దాం. నువ్వుకూడా మొక్కుకో అంది చుక్క.

మల్లిద్దర వెంకుకులే అంది పాపాలు.

నీజిమ్మడ బుద్ధిపోనిచ్చుకున్నావు కాదు అంది చుక్క.

* * *

తలుపులికి గంజినీళ్ళుపోసి, గుడిసెవతలికొచ్చింది చుక్క.

మూడు గంటల కారొచ్చుండాలి. అదే పాటికి దిగుండాలి. నా తల్లో! నివ్వే దిక్కు అనుకుంటూ నించుంది.

పకీరొస్తే ఎందుకేనా వుంటుందని రెండు బడితెలూ ఓ పెద్దగెడా రెండు కొరకంచులూ తీసి ఓపక్కన అట్టే పెట్టింది.

చుక్క తమ్ముడు పరుగున వచ్చి అక్కా అక్కా కారొచ్చేసింది గాని ఆడురాలేదు.

నాను చూశా నాను చూశా. కళ్ళే బడ్డీ రంగన్న కూడా ఒకటే ఆచ్చిరం! పకీరు గాడు రావేదని అన్నాడు.

చుక్క ఒక్క లగువున లోపలికెళ్ళింది. ఆడురా లేదు మావో. ఆడురా లేదు. అంతా అబద్ధం. అంటూ తెలుపుల్ని కౌగలించుకుంది.

తెలుపులు, మెల్లిగా కళ్ళుతెరిచి ఆ! అన్నాడు.

గంటం గడిచింది మావా ఆడు రాలేదు. మద్దివేళ డైవోరు పరాసికం ఆడుండాల యదవసచ్చినోడు మళ్ళీ పాల్లానీ సెప్తా. అంది.

తెలుపులు అమాంతం చుక్కని గాఢంగా కౌగలించుకున్నాడు. తెలుపులు కళ్ళంట జొటజొట కన్నీళ్లు కారాయి. జ్వరం దిగిపోయింది.

ఎందుకన్న మంచిది గాని, మావా, ఇప్పుడే నావకెల్లి, పట్నంలో పోలీసోళ్ళకి సెప్ప రాదా సింతాల తూనీకేసులో పకీరుగాడికి జేలు కాయమయేదాకా ఈడ కాపలా వుండాలనీ అంది చుక్క.

తెలుపులు చుక్కని దగ్గరకి తీసుకుని వీపుతట్టాడు. జుట్టు సరిచేశాడు. ఎర్రిమొకవా. మనకోసం పోలీసాళ్ళొత్తారే యెర్రిమొక వాని మొకంచూడు. అన్నాడు. అంటూనే చుక్క మొహం చూశాడు. ఎంత సక్కని మొకం. కళ్ళుబ్బిపోనాయిగాని, పాపం. యంతేడిశావో నాకోసం అన్నాడు.

సర్లె బాగుండాయి సరసాలు. కొత్తుంటే ఆడొచ్చి ఈపీ్మనరే వెట్టుండేవోడే గందా అంది పావాలు నీరసంగానే నవ్వుతూ.

చుక్క పకపక నవ్వింది. బుద్ధిపోనిచ్చు కున్నావుగా దప్పా. పకీరుగాదు; యములాడొచ్చినాసరే మావిలాగే కౌగిలించుకు సరసాలాడుతూనే సచ్చిపోతాం. నియ్యాల్లే నాకు జెరంరాదు ఆపదలొత్తే అంది.

అలాగే అలాగే ఊసులాడ్డానికేవి. మద్దినాల వతిసెడితోకన్నా లెట్టినాళ్ళవో. .. సూర్దారి, ఆడు మూడుగంట్ల కారుకి రాపోతే ఆ తరవాద్దానికి రాడని కరారేటి. కాపీనీల్లో కల్లునీల్లో దాగుతుంటే కారు తప్పించుచ్చుగా అంది సావాలు.

తెలుపులు పట్టు దప్పినట్టయి తలెత్తిమావింది చుక్క.

మళ్ళీ వెర్రిమాపు పడిపోయింది.

ఆ! ఏటేటీ ఎలాగెలాగా అంటూ కొయ్యబారిపోయాడు తెలుపులు.

నీజిమ్మడ. యదవనోరూ నివ్వూనుఅంటూ లేవబోయింది చుక్క.

తెలుపులే చుక్కని పక్కకితోసేసి లేచి నిలబడ్డాడు.

అమాటా రైటే ఆ మాటా రైటే అటూ గబగబ గుడిశవతలకి వెళ్ళిపోయాడు.

యాడకెళ్ళ్యావ్ సామీ! అంటూ వెంట



కరెంటు లేదని సినిమా ఆపేశాడు. పోనీ, ఫేన్లన్నా వేయకూడదటండీ! స్త గాలితగుల్ను!

—చిత్రం: చందనసోమయ్య, రాజమండ్రి.

ంది చుక్క.
వల్లోత్తా మల్లొత్తా అంటూ గబగబ వెళ్ళి
యాడు తలుపులు.

* * *

పొద్దు వాటారింది. ముత్యాలమ్మ గుడి
ర రావిచెట్టు కింద కూర్చున్నాడు తలు
ు చిత్తుగా తాగేసి.
నా సావిరంగ, రారా ఇయ్యాల నువ్వో
నో పిల్లా పెస్లా తేలిపోవాల. పుచ్చరెగిరి
పోవాల. నయ్యాల. అని గొణుక్కుం
న్నాడు.
అరమైలు అసింటా అప్పుడే బస్సుదిగిన
ాజెట్టీ పకీరు కూడా అదేమాట అను
్నాడు కసిగా. దిగుతూనే ఎదర కెళ్ళి
ోపలికెళ్ళి కూర్చున్నాడు. బస్సు కది
, బస్సులోంచి ఒకేఒక ఇస్తోకు దిగింది.
సిని సోడానీల్లియ్యవో అన్నాడుపకీరు.
వాడు కాళీసోడా కాయపట్టుకు లోపలి
'నీళ్లు' నింపి ఇచ్చాడు.
పకీరు గడగడ తాగేసి, ఇంతకన్న కుళ్ళీ నీళ్లే ఇత్తే సరిపోయేదిగాయదవా అన్నాడు. భుజంమీద తువ్వాలుతీసి తలపాగా చుట్టుకున్నాడు. లుంగీ సరిచేసి బిగించి కట్టుకున్నాడు.

ఈవల ఒకటే జట్కా వుంది. అందులో ఇందాకటి ఇస్తోకులో రాణి కూర్చునివుంది. రాజా బడ్డీ దగ్గరకొచ్చి సిగరెట్లు కొంటున్నాడు. పకీరు బండిదగ్గర కొచ్చి, దిగండమ్మా. ఈబండెల్లదు అన్నాడు.

బండిలో అమ్మాయి కంగారుపడి ఏవండీ ఇటుచూడండి ఇతనేమిటో అంటున్నాడూ అంది.

దిగమ్మ తల్లే అన్నాడు పకీరు విసుగ్గా.

రాజా విసురుగావచ్చాడు. ఎవ్రడానువ్వు ఆడవాళ్ళని డబాయిస్తున్నావు బ్లడీ ఫూల్ అంటూ.

పకీరు వెనక్కి తిరుగుతూనే ఎడంచెయి తిరిగేసి వెనక్కి విసిరాడు.

అమ్మో అని ఒక్క కేకపెట్టి చెయ్యి చెంపని అదుముకున్నాడు రాజా. మళ్లీ మాటాడలేదు. అలా చెంపని చెయ్యేసుకుని గుడ్లప్పగించిమాటలేకుండా, జెజెమ్మలాఅరడుగుల ఎత్తున ఉన్న పకీరు వేపు చూస్తువుండిపోయాడు. అమ్మాయి మాట్లాడకుండా బండిదిగిపోయి తనే పెట్టె కిందకి దించేసింది. మరచెంబు తీసి చేతపట్టుకుని తిన్నగా భర్త దగ్గరికి వచ్చేసింది. జెబ్బ పట్టుకుని ఇలారండి అని అసింటా చెట్టుదగ్గరకి లాక్కుపోయింది అతను చెంపని చెయ్యి తియ్యలేదు. కన్నార్పలేదు. పన్నెత్తి పలకలేదు. అలాగే చూస్తు బొమ్మలాభార్యపక్క నచతికిలబడిపోయాడు.

పకీరుబండిలో ఎక్కి కూర్చున్నాడు. ఊళ్ళోకి పోనీ అన్నాడు.

కోడు బావులేదు అన్నాడు బండివాడు.

పోనీ అన్నాడు పకీరు.

బండి కదిలింది. బండిలో అమ్మాయి జోళ్ళుండి పోయాయి. ఇవతలకి విసిరెసు బులోయ్ జోళ్ళొగ్గేసినావుఅన్నాడు పకీరు.

* * *

తూము మలుపుదగ్గరే నే జట్కా ఆపేశాడు బండతను. బుడ్డోడికి జరం కాసిందని, ఇట్నుంచిలా ఇంటికెళ్తానని బతిమాలి దింపేశాడు. పకీర్ని.

పకీరు నవ్వాడు, ఎదవనాయాల. ఏవా బద్దాలడావుగా. ఎంతబయ్యంరా ! కూడా వత్తే సాచ్చాలియ్యాలని గదా బయ్యం. నాకు తెల్దేటి, అందుకే బండిదోలుకు బతుకుతున్నావు. బీడీవోటిచ్చెల్లు అన్నాడు.

* * *

రావిచెట్టు దగ్గర బండకానుకుని కాల్లకిలా వడుకుని కాలుమీద ఏసుకుని వెకిలి ధైర్యంతో ఏడుపులాటి నవ్వుతో, పిచ్చిలాటి తెలివితో లొల్లాయిపదాలు పాడుతున్నాడు తలుపులు గట్టిగా. పుచ్చపువ్వులా వెన్నెల కాస్తోంది. బూతుపదాలు నాలుగువీధులా వినిపిస్తున్నా ఎవరూ ఈవలకొచ్చి వాణ్ణి మందలించలేకపోయారు. కరణంగారు సకుటుంబంగా సినీమాకెళ్ళిపోయారు ఎందుకేనా మంచిదని. ప్రసిడెంటుగారూ వారికి తోడుగా వెళ్ళారు.

దశమినించి చవిద్దాకా వెన్నెలబంతులాడే పిల్లలు ఇళ్ళలోనే సర్దుకుపోయారు. ఎక్కడా సందడిలేదు. అలికిడిలేదు. ఊరందరికీ ప్రాణం ఖంగారుగా వుంది. మనసు గుబులుగా ఉంది. తెల్లారేలోగా ఓఘాయిత్యం జరగడం ఖాయమని అందరికీ అనిపిస్తోంది.

చుక్క రెండుమార్లొచ్చి తలుపుల్ని బతిమాలింది కొంపకి రమ్మని.

నాసావిరంగా ఇయ్యాల అదో నేనో తేలిపోవాల, అన్నాడు తలుపలు. రెండోసారి

(44 వ పేజి చూడండి)

# వంచన

నాకు ఆడవాళ్లంటే అసహ్యం, కోపం. మగవాడిని కవ్వించి, నవ్వించి, తన సంతోషానికి ఎరగా చేసుకొని, తన అవసరం తీరగానే విసిరిపారేస్తుంది స్త్రీ.

ప్రాచీనకాలంలో ప్రాచ్యదేశాల చక్రవర్తులు సింహాలను బోనులలోనుంచి వదిలి, బానిసలను వాటితో పోట్లాడడానికి పంపేవాళ్ళు. అది వాళ్లకు వినోదప్రదర్శనం. అటువంటివాళ్ళే ఆడవాళ్ళు—

ఆడవాళ్ళను అమాయికులని, అబలలని, మంచివాళ్లని నమ్మిన నన్ను ఈ నిశ్చయానికి ఈడ్చుకువచ్చింది పార్వతీ, కమలా ఇద్దరూ.

పార్వతితో నా మొదటి పరిచయం మా అన్నయ్య పెళ్ళిలో. అప్పటికి నేను నూత్న యౌవనంలో ఉన్నవాణ్ణి. శృంగారాన్ని గురించి చదివిందీ, తెలిసిందీ ఏమంత లేకపోయినా కనిపించిన అందమైన స్త్రీని కన్నార్పకుండా చూడడం, అప్పుడప్పుడూ కొన్ని వెర్రివేషాలు వెయ్యడం చాలామంది కుర్రవాళ్ళకు మాదిరిగానే నాకూ అలవాటుగా ఉండేది.

పెళ్ళి జరుగుతున్నంతసేపూ పెళ్ళికూతురు వంకే పార్వతి కన్నార్పకుండా చూస్తూ నిలబడ్డది. అప్పుడే అమాంతం దిగబడ్డ మా చిన్నాయన తరఫున, ఆడపెళ్లివారింట్లో ఆ అమ్మాయి కాఫీ ఏర్పాట్లు చేయగలదేమో అడగడానికి వచ్చాను.

నేను చెప్పింది విన్నట్లులేదు పార్వతి. ఏమిటన్నట్లు నావంక చూసింది. జరుగుతున్న పెళ్ళిలో పార్వతే కాదు, ఎవరైనా, అంతగా నిమగ్నం కావడం నాకు నచ్చదు. అంత తీవ్రంగా పరిశీలించవలసింది పెళ్ళిలో ఏమీ లేదని నావాదం. పైగా పరిశీలిస్తే తెలిసేది ఏమీ ఉండదు. అది ఎవరికివారు అనుభవించవలసిన అనుభూతి. ఆ సంగతే పార్వతితో చెబుదామనుకున్నాను. కాని ఆ అమ్మాయి కళ్ళు పెద్దవిచేసి, విచ్చిన తామర పూవులా నా వంక చూసేసరికి నాకు నిలదొక్కుకోవడం కొంచెం కష్టమై "అదే... బాబాయి... కాఫీ" అని మాత్రం అనగలిగాను.

పార్వతి నవ్వి, దొడ్లో వంటపందిరివైపు వెళ్ళింది.

పెళ్లిలో నాకు ఆ అమ్మాయినిగురించి తెలిసిన విషయాలు రెండు: ఆ అమ్మాయి ఆ సంవత్సరమే స్కూలు ఫైనలు పూర్తి చేసిందని, పట్నానికి చదువుకు వస్తోందని.

పార్వతి పెళ్లికూతురుకు వేలువిడిచిన చెల్లెలు. మూడు నిద్రలకు వాళ్లమ్మతో పాటు పార్వతికూడా మావూరువచ్చింది. ఆ అమ్మాయి కళ్లల్లో ఓ వెలుగుఉంది. నవ్వినప్పుడు అది మరీ కాంతివంతమై ఉండేది. అమాయకతను జ్యోతిగా వెలిగించి భగవంతుడికి అర్పణచేస్తే ఆయన దానిని స్వీకరి... టప్పుడు అంతర్జ్యోతీ ఆనందంతో ...రెట్లు ఎక్కువై, ఆ వెలుగు భగవంతుడి ...గులో కలిసిపోతున్నట్లు అనిపించేది ... ఆమె కళ్లల్లోకి చూస్తే.

తరువాత నాలుగేళ్లు—కలలుకంటూ, ...తంలో వాటి సార్థకతను చూడాలని ఉ...వ్విళ్లూరుతూ, కనుచూపు మేరలో ఆన...నిలయం ఉన్నదని మురిపించింది పార్వ... బ్రతుకులో ఆ ఆశ ఒక్కటే నాకు ప్ర...ప్రదం అయింది. ఆ నాలుగేళ్లూ నా... పాటు, నేను ఊహించిన ప్రతి కల్పన... పార్వతి రంగులు దిద్దింది. నేనుపాడిన ప్ర... పాటకూ స్వరం వేసింది.

జీవితమంతా ఆనందమయం చేసుకో... తరుణం వచ్చిందని, ఆ కాస్తమాటా ... వాళ్ళ చేత అనిపిస్తే బావుంటుందని అన్నా...



నేనుఅడిగినప్రశ్నకు చిన్నగా సిగ్గుపడి "ఛా, కాదండి మా అన్నయ్య కొడుకు" అన్నది కమల.

# ★ వంచన ★

నేను. అంతకంటేనా అన్నది పార్వతి, సెలవుల్లో ఇంటికి వెళుతూ. పదిహేను రోజుల్లో నీ ఇంట్లో, నీదగ్గర ఉంటే సరికదా అని రైలు ఎక్కింది పార్వతి.

అదే నేను ఆఖరుసారి పార్వతి ని చూడడం. ఏమైందో నాకు ఈనాటికీ తెలియదు. ఆమెనుంచి ఏ కబురూ తెలియక పోతే నేను ఉత్తరం వ్రాశాను. సమాధానం లేదు. ఏం జరిగిందోనని భయపడ్డాను. జరిగిందంతా అమ్మతో చెప్పాను.

పాపం! అమ్మ! నాకోసం ఎంత చేసింది!

పార్వతి తండ్రిని 'మీ అమ్మాయిని మా అబ్బాయికి ఇవ్వండి అని అడగడానికి వెళ్లింది అమ్మ.

కొడుకుకోసం-ఆవిడమాటవీ నాదూలక్ష్య పెట్టని కొడుకు సౌఖ్యం కోసం-ఆచారాలు, పరువు ప్రతిష్ఠలూ అన్నీ వదిలి వెళ్ళి అడిగింది అమ్మ.

పార్వతికి అప్పటికే పెళ్ళి నిశ్చయం అయింది-ఓ పెద్ద ఇంజనీరుతో. ఆ మాత్రం చెప్పడా మావాడు అన్నదట అమ్మ. అందరూ కలిసి అమ్మను అవమానం చేశారుట. 'మా అమ్మాయి చేసుకోకపోతే మీ అబ్బాయికి పెళ్ళి కాదని వచ్చావా' అన్నారట. పార్వతి అక్కడే వుండి, ఒక్కమాట మాట్లాడలేదట.

నేను నమ్మలేను. పార్వతి! ఇన్నాళ్ల మాకలలు, పార్వతి ఓదార్పు! నేను నమ్మలేను.

అయినా జరిగిందదే - పార్వతి ఓ పెద్ద ఇంజనీరు గారి ఇల్లాలయింది.

అమ్మకు తనకు జరిగిన అవమానం కన్న - నాకోసం, పార్వతితో నా పెళ్ళి జరగనందుకు - ఎక్కువ బాధపడింది. సంవత్సరం పాటు నాకు నీడలా తిరిగింది. ఆ సంవత్సరమూ నన్ను నాలుగో ఏట ఎట్లా పెంచిందో అట్లా పెంచింది అమ్మ.

జీవితంలో ఎన్ని అనుభవాలు వచ్చినా ఆ అనుభవాలనుంచి నేర్చుకోవలసిన నీతిని మాత్రం నేర్చుకోడు మనిషి. ఎప్పటికప్పుడు మళ్ళీ ఏదో ఆకర్షణ, ఆశ, ఊహాకల్పన, దానిని సాధించడానికి ప్రయత్నాలు.

డాక్టరుగా ప్రాక్టీసు పెట్టిన సంవత్సరానికి నాకు కమలతో పరిచయం అయింది. సాయంకాలం ఏడు గంటలప్పుడు చిన్న పిల్లవాడిని భుజాన వేసుకొని దాదాపు ఏడుస్తూ ఆసుపత్రికి వచ్చింది. అది చిన్న బిడ్డ నొప్పిలాంటిది. ఇంటి దగ్గర ఎన్ని చేసినా పిల్లవాడికి తెలివిరాలేదు. భయం లేదని ఓదార్చి కుర్రవాడికి ఇంజక్షను ఇచ్చాను. కుర్రాడు తేరుకున్నాడు.

మర్నాడు వచ్చినప్పుడు వివరాలం

చెప్పింది కమల. నేను అడిగిన ప్రశ్నకు చిన్నగా సిగ్గుపడి "ఛా! కాదండీ! మా అన్నయ్య కొడుకు. వాడు కాంప్రకు వెళ్ళాడు... నేను ఆడపిల్లల బళ్ళో సైన్సు టీచరుగా పని చేస్తున్నా," అన్నది.

పెళ్ళి అయితే ఆడవాళ్ళు ఉద్యోగం చెయ్యరని నాకున్న దురుద్దేశ్యం వల్లనో, మీ అభిప్రాయం?" అని నేను అడిగితే "ఛా"తో మొదలుపెట్టి ఆవిడ చెప్పిన సమాధానం చేతనో కమల చెప్పకుండానే ఆవిడకు పెళ్లి కాలేదని తెలుసుకొన్నాను.

తరువాత కమల తరుచు ఆసుపత్రికి వచ్చేది. ఒకరోజున భోజనానికి పిలిపించింది వాళ్ళ అన్నయ్య చేత. ఒకటి రెండు సార్లు ప్రసంగవశాత్తు కమల "ఏమండీ డాక్టరు గారూ! మీరు పెళ్లి చేసుకోరా యేం?" అనీ, "రెండుచేతులా సంపాదిస్తున్నారు, ఇక పెళ్ళి చేసుకోవచ్చును" అనీ నన్ను హెచ్చరించింది.

నాకటి నా అనుభవం వల్ల ధైర్యం చేసి కమలను నేను నా జీవితంలో భాగస్వామిని కమ్మని అడగలేకపోయాను.

అమ్మ పెళ్లి చేసుకోమని ఒత్తిడ చెయ్యడం మొదలుపెట్టింది. ఒక్కగాను ఒక్క కొడుకు సుఖపడుతుంటే చూడాలని ఆమెకు ఎంతగానో ఉంది. "తోటి ఆడవాళ్ళందరూ హాయిగా కాపురాలు చేసుకొంటున్నారురా నాయనా! నా మాట విను ఇంకా జరిగిన దానికి ఎందుకు విచారిస్తావు?" అనేది అమ్మ.

హఠాత్తుగా ఒక సాయంకాలం కమల వచ్చి తాను చేస్తున్న పంతులమ్మ పనికి రాజీనామా నిచ్చాననీ, మెడిసిన్‌లో చేరుతున్నాననీ చెప్పింది. 'మీరు నాకు ధైర్యం ఇవ్వాలి డాక్టర్' అన్నది. నా కళ్లల్లో కళ్ళుపెట్టి నవ్వింది. 'కోర్సు అయ్యాక మీ దగ్గరే అసిస్టెంటుగా ఉంటా' నన్నది.

నా ఆశలు చిగురించాయి. జీవితంలో ఓ కొత్త ఆనందం, ఓ కొత్త పులకరింత—

దాదాపు రోజూ నా దగ్గరకు వచ్చి చదువుకొనేది కమల.

'నాయనా! నువ్వు కమలను చేసుకోరా" అన్నది అమ్మ ఒకరోజున.

"తొందరేం అమ్మా! ఆగు" అన్నాను.

"ఇంకా తొందరేంటా వేరా నాయనా?" అని కంట తడిపెట్టుకున్నది అమ్మ.

కమల మొదటి సంవత్సరం పూర్తిచేసింది.

ఇదంతా మీ మహిమేనన్నది.

మీకు పార్టీ ఇస్తానన్నది.

మీకు ఏం ఇచ్చినా తక్కువే అన్నది.

వాళ్ళింట్లో చక్కని ఐస్‌క్రీం ఇచ్చింది నా కళ్ళల్లో కళ్ళుపెట్టి నవ్వింది.

ఆ కళ్లలో నవ్వులు కంటిప్రక్కలకు తొంగిచూసిన కౌటుక గీతలో కలిసిపోయి, హార్దిక కాంతిలో మెరుపుల్లా ఉన్నాయి.

"సినిమాకు వెళదాం డాక్టర్" అన్నది.

"అంతకంటేనా?" అన్నాను.

"ఏరా, నాయనా! కమలనే చేసుకోరా" అన్నది అమ్మ.

"అలాగే లేవే" అన్నాను.

అమ్మ ప్రాణం కుదుటబడ్డది. చెప్పలేనంత సంబరపడ్డది. "ఎన్నాళ్ళకు విన్నానురా, చల్లనిమాట" అని మురిసిపోయింది.

ఇన్నాళ్ళకు అమ్మను సంతోషపెట్టే ఒక్క పనైనా చేయగలుగుతున్నందుకు ఆనందంగా ఉంది నాకు.

సినిమా చూసి చప్పట్లుకొట్టి నవ్వుతోంది కమల—జీవితాలతో ఆటలాడే కమల. కమల నా జీవితంలోకూడా ఇంత ఆనందాన్ని తెచ్చిఇస్తుంది. ఈ కమల నాది. ఆ మాట చెప్పాలి.

"కమలా!" బిగ్గరగానే అన్నాను కాని అది నాగొంతునుంచి వెలికిరాలేదు. కంఠంలో వణుకు.

నాకు నవ్వువచ్చింది. ఆనందానికీ దుఃఖానికీ రెంటికీ ఒకరకమైన స్వేదమూ, హృదయస్పందన కలగడం ఏమిటి? మానసికమూ, శారీరకమూ అయిన ఈ అనుభవానికీ ప్రకృతికీ సంబంధం ఏమిటి?

కథలో ఒక ఎన్ని వేశానికి అందరూ విరగబడి నవ్వుతున్నారు. కోరస్‌లో కమల గొంతు కూడా ఉన్నది. నేను ఎందుకు నవ్వడం లేదన్నట్లు నావంక చూసింది కమల.

"ఏమిటి డాక్టర్?"

ఆమె కళ్ళల్లో నవ్వు మెరుపులా బంగారు తీగలా వెలుగుతోంది.

"కమలా!" అంటూ ఆమెను దగ్గరకు తీసుకొని ఆ మెరుపును అందుకున్నట్లు ఆమె కళ్ళను ముద్దుపెట్టుకున్నాను.

కమల చివాలున లేచి బయటకు వెళ్ళిపోయింది. "కమలా" అని పిలుస్తూనే ఉన్నాను. భయం అనుకున్నాను.

వెళ్లిపోయింది బయటకువచ్చి చూశాను. జాడ కాను. కనిపించలేదు.

నేను చేసిన పనికి బాధపడిందా?

మాటా, పలుకులేకుండా ఈ నిష్క్రమణ ఏమిటి?

ఆమె ఇంటికి వెళ్లడానికి నాకు మనస్కరించలేదు. ఏమిటో, భయంకూడా వేసింది.

ఆ మర్నాడే వాళ్ళ అన్నయ్య నా దగ్గరకు వచ్చి, నన్ను పదిచివాట్లువేసి, నాలుగు ధర్మపన్నాలు ఉపదేశించి వెళ్లాడు. ఆయన చెప్పినదాని సారాంశం: కమలకు రెండున్నర సంవత్సరాల క్రితమే పెళ్ళి అయిందని భర్త కేంద్రప్రభుత్వం స్కాలర్‌షిప్ మీద బొంబాయి టాటా ఇన్‌స్టిట్యూట్‌లో రిసర్చి చేస్తున్నాడని.

నేను దిగ్భ్రాంతపోయాను.

(45-వ పేజీ చూడండి)

# అన్వేషణ

పోతుకూచి సాంబశివరావు

(గతవారం తరువాయి)

నగరులోని వాతావరణం చాలా అహ్లాద కరంగా అగుపించింది మొదటలో ాంకు. భోజనసౌకర్యాలు చూసే తల్లి సమాచారాలు కనుక్కుంటూ వివిధ యాల్లో నిత్యమూ పలవరిచ్చే తాతయ్య నే వుండడం ఏమిటో పదివినుగుల సేకరించుకున్నట్లయింది.

ుచికరమైన భోజనం, ప్రశాంత వాతా ం, అభిమానుల ఆదరణ లభ్యమయివ ాం, చీకు చింత లేక ఆకారంలో చెం పుష్టిపెంచుకుని హాయిగా బ్రతిక ాడు.

రమహంసతోబాటు నాటకాల్లో ప్రద వడంవల్ల రాణితో సహా సమానమైన ారం శివరాం కుకూడా లభించింది. ర్వ నాటకసమితినుంచి కొంచెం దూర శివరాం ఏవిధంగాను తన కార్యక్రమా విఫలుడు కాకుండా మసలడం ఈశ్వ ్య అహంభావానికి, గర్వానికి దెబ్బతీసి యింది. నగరంలోని వివిధవ్యక్తులు ంకుచూపే గౌరవ మర్యాదలలో ఏ ే కనిపించకపోవడంతో, కార్యదర్శిగా ప్రత్యేక ప్రాముఖ్యత ఏమి లభించ గుర్తించుకున్నాడు ఈశ్వరయ్య.

ుభావంగా శివరాం మునుపుయిచ్చిన ్నాలు అందుకుని పరమహంస ప్రదర్శ హాజరయ్యాడు ఈశ్వరయ్య. రాణిని కులికాడు. ఆమెతో పరిచయం కలగ ోవాలనే ఆత్రుత హెచ్చింది. వయ ను, సాంఘిక పలుకుబడిలోను హెచ్చు మనిషిలా బ్రతుకుతున్న పరమ ుతో సాన్నిహిత్యం దుర్లభమని ుచి, మునుపున్న స్నేహాన్ని యిను పచేసుకుని, శివరాంను మచ్చికచేసు అతనిద్వారా రాణిస్నేహం పొందా ుశించాడు ఈశ్వరయ్య.

ుకరోజు వీధిలోపోతుంటే, శివరాంను పలకరించాడు ఈశ్వరయ్య. బలవం తంగా హోటలులోకి తీసుకువెళ్ళి వేడికాఫీ యిచ్చాడు. "ఎక్కడా కనిపించడం మానేసే వేమోయి యీమధ్య...పూర్తిగా మన నాటకసంస్థను మరిచిపోయినట్లున్నావే... యీమధ్య "వికారం" అనే నాటకం రిహా ర్సల్సు వేస్తున్నాం...నీకోపాత్ర యివ్వా లని ఉంచాం...వచ్చినాటకంలో వేద్దూ... మనమంతా యీ నాటకమండలి స్థాపకులం కనుక, దీని అభివృద్ధికి మనం సర్వవిధాల సహాయపడాలి!"

తన ఉపన్యాస ప్రవాహానికి తనే ఆశ్చర్య పడినట్లు అనుభూతిపొంది ఒక చిఱునవ్వు నవ్వాడు.

ఈశ్వరయ్య తన్ను మభ్యపెడుతున్నాడని పించింది శివరాంకు. వ్యక్తిగత ఘర్షణలు విస్మరించి ఏ కారణంవల్లనైనప్పటికీ ముందుకు వచ్చే అవకాశాలు వినియోగించు కుంటున్నప్పుడే వ్యక్తి విలువలు తమంత తామే హెచ్చుతాయని నమ్మిన శివరాం, ఆ మాటల్లోని ఈశ్వరయ్య అంతర్భావం స్వార్థం, గుర్తించకుండానే "వికారం" నాటకంలో పాత్ర వేస్తానని అంగీకరించాడు. తన పన్నుగడ పారిందని ఆశించి ఈశ్వరయ్య సంతో షించాడు.

'ఏమోయి...రాణి మన నాటకాల్లో వేస్తుంది! ......మామూలుగా అందరికీ యిచ్చేటట్లుగానే ఈమెకే యిద్దాం...! అతి సరళంగా మాట్లాడేననుకుని నవ్వుకున్నాడు ఈశ్వరయ్య.

'కనుక్కోమని నిన్ను బాధపెట్టటం లేదోయి ... ఒకరోజు నన్ను ఆమెకు పరిచ యం చేస్తే తక్కిన విషయాలు నేను మాట్లాడుకుంటా!" ఏవో పగటికలలలో తేలి ఈశ్వరయ్య మత్తుగా హాయిగా నవ్వాడు.

రాణి పరిచయస్థులరంగంలోకి ఈశ్వరయ్య కూడా ప్రవేశించడం మానవ సైజమైన దుర్బలత్వ నిదర్శనమే ననుకున్నాడు శివరాం. ఈశ్వరయ్యను ఆమెకు పరిచయం చెయ్యడంలో బాహ్యంగా తనకేమీ నష్టం కలిగినట్లు భావించలేదు శివరాం.

ఈశ్వరయ్యను ఒకరోజు సాయంత్రం రాణి యింటికి తీసుకెళ్ళాడు శివరాం. రాణిని చూడగానే తన క్రొత్త సూటు ఇస్త్రీ మడతలు నలగకుండా నిలుచుని వంగి, నమ స్కరించి సున్నితమైన చిరునవ్వుతో చూపించిన కుర్చీమీద కుర్చున్నాడు ఈశ్వరయ్య. అతనిని పరిచయంచేసి అతను వచ్చిన పనిని ముక్తసరిగా చెప్పాడు శివరాం. నాటకాల్లో తన అనుభవం, నాటక సంస్థ లలో తాను చేసిన కృషి, తాను దర్శకత్వం వహించిన నాటకాలు విపులంగా ఏకరువు పెట్టి 'వికారం' నాటకంలో నాయిక పాత్ర వహించాలని రాణిని కోరాడు.

'నాకు ఒంట్లో బాగుండటం లేదండీ... ఈమధ్య వికారం, డోకులు, జ్వరం...... చాలా అనారోగ్యంగా వుందండీ ... అందు చేత క్షమించాలి!...... ముభావంగా నవ్వి ఊరుకుంది రాణి.

'అరెరె!' అంటూ నాలిక జారుస్తూ సానుభూతి చూపాడు ఈశ్వరయ్య.

రాణి ఇంక ఏమి మాట్లాడకుండా కూర్చుంది. ఈశ్వరయ్యకి మరే ప్రసక్తి తేవాలో అర్థంకాలేదు. "మీరు వేసిన నాటకాలు చూశాను...బాగా నటించారు" వినయంగా నవ్వాడు ఈశ్వరయ్య.

'అది మీ అభిమానం!'మందస్మితం చేసింది రాణి.

ఒక నిముషం నిశ్శబ్దం.

పనిమీద వచ్చిన ఈశ్వరయ్యకు పని పూర్తయిందనిపించింది. రాణి చనువుగా తాను ఇతరచోట్ల చూసిన వారాంగనల్లా ఎక్కువగా ఏమీ మాట్లాడలేదు. యేవో కబుర్లు చెప్పి అవసరమైతే రెండు చిన్న పాత్రలు అభినయించి, రాణిని సమ్మోహన పంచాలనే ఈశ్వరయ్య కాంక్ష మొదట్లోనే త్రుంచబడింది. ఈసారి మళ్ళీ ఇంకో నాటకం తీసుకునేటప్పుడు మీ దగ్గిరకే వస్తాం...అప్పుడయినా ఒప్పుకుంటారని ఆశిస్తున్నా!' పెద్దవల వేస్తున్న చేపలవాడిలా సంతృప్తిపడ్డాడు ఈశ్వరయ్య.

'అల్లాగేనండి...యెల్లకాలం అనా రోగ్యంగా ఉండదుగా!'...రాణి మెల్లిగా నవ్వి లేచి నమస్కరించింది.

రాణి లేవడంతో తానుకూడ లేచి నిష్క్ర మించవలసిన సమయం ఆసన్నమయిందని గ్రహించుకున్నాడు ఈశ్వరయ్య. సెలవు అంటూ తుదినమస్కారం పెట్టి, ప్రయో జనం ఇవ్వని తనసూటును నిందించుకుంటూ గుమ్మం దిగాడు ఈశ్వరయ్య. శివరాం కూడా వచ్చిన స్నేహితునితో వెళ్ళిపోవడం భావ్యం అనుకుని ఈశ్వరయ్యను అనుసరించాడు.

'మీతో కొన్ని ముఖ్య విషయాలు మాట్లాడాలండి...వారిని పంపించి మీరు ఆగుతారూ!' రాణి మందస్మితం, ఆమె మాటలు శివరాంకు చాలా విచిత్రమనిపిం

డాయి. ఆమెమీద తనకున్న అనుమానాలు ఆమెగురించి తను ఊహించుకున్న సంగతులు ఏవో అన్నీ విడిపోయి రాణి ఏదో క్రొత్త స్వరూపంతో అగుపించినట్లు ఉబ్బిపోయాడు శివరాం.

గుమ్మం దిగుతున్న ఈశ్వరయ్య ఆశ్చర్యంగా ఆగి ఒక నిముషం నిలుచున్నాడు.

'మీకేమి అభ్యంతరం లేదనుకుంటా!' రాణి ఈశ్వరయ్యను ఉద్దేశించింది.

భావితలంపుల్లో ఆమె గురించి కార్యక్రమాలు అన్వేషిస్తున్న ఈశ్వరయ్యకు ఆమెకు అసంతృప్తి కలిగించడం ఇష్టంలేక, శివరాంను ఆగమని తాను ఒంటరిగా వెళ్ళిపోయాడు.

రాణీ శివరాం, మళ్ళి యథాస్థానంలో ముందుగదిలో కుర్చీల్లో కూర్చున్నారు. రాణి మౌనంగా సంభాషణ కది మేముందు తీవ్రంగా ఆలోచిస్తున్నట్లు సుఖభంగిమల్లో మునిగిపోయింది.

'ఏముఖ్యా ముఖ్య విషయాలు?" శివరాం ఆత్రుతగా ప్రశ్నించాడు.

మరియమ్మ టీ తెచ్చి వెళ్లిపోయింది. ఇద్దరూ చెరొక కప్పు అందుకున్నారు.

'ఈ విషయం మీతో ఎంతో కాలంనుంచి చెబుదామనుకుంటున్నానండీ.... మరేమీ అనుకోకూడదూ!" అమాయకంగా దీనంగా ముఖం పెట్టింది రాణి.

'ఏమి అనుకోను!' తీవ్రంగా, నిశ్చితవదనంతో ఆతురాలైన ఒక స్త్రీ తన జీవిత రహస్యం చెబుతోందనే ఆశతో, అతి నిజాయితీ మనిషిలా కూర్చున్నాడు శివరాం టీ గుటకలు వేస్తూ.

రాణి టీ కప్పు ఖాళీచేసి ఎదురుగా మేజా బల్లమీద ఉంచింది.

రాణి, గాజులు గలగల్లాడిస్తూ ముఖం అరచేతులతో తుడుచుకుని, కళ్ళు రాసుకుని, శివరాంవైపు తదేకంగా చూసి, మెల్లిగా నవ్వి నవ్వు పెంచి,పకపక నవ్వేసింది గట్టిగా. శివరాం ఆశ్చర్యపోయాడు.

రాణి అతన్ని చూసి మళ్ళీ కిలకిల నవ్వింది. నవ్వు ఆపుకోలేక పొట్టపట్టుకుని, ఒగరుస్తూ కంటివెంట ఆనందబాష్పాలు రాలుస్తూ,ఆనందం పట్టలేక చప్పట్లు చరుస్తూ కుర్చీమీద ఒరగా వాలిపోయింది.

ఈ నవ్వుల శబ్దం విని మరియమ్మ వచ్చి తొంగిచూసింది.

'ముఖ్య విషయాలు...ఏమీ లేవండి.... మీస్నేహితుణ్ణి పంపించేసి మిమ్మల్ని ఇంకా కొంతసేపు మాయింట్లో అట్టేపెట్టెయ్యాలని ......'మళ్ళీ పకపక నవ్వింది.

అదంతా నటనో, నిజమో అర్థం కాలేదు శివరాంకు. చెప్పదలుచుకున్నది ఏమీ లేక యిలా నటించడం నిజమో, చెప్పదలచుకున్నది చెప్పలేక పరిస్థితి మార్చుతూ యిలా నటించడం నిజమో సతమతమయ్యాడు. కాని రాణి ప్రవర్తనలో ఏదో కొంత విచిత్ర గూఢజీవితం మాత్రం ఉందని నిర్ణయించుకున్నాడు శివరాం.

శివరాం తన్ను గురించి తీవ్రంగా ఆలోచిస్తున్నాడని అర్థం చేసుకుంది రాణి. అతని ఆలోచనలు సాగకుండా ఎదురుగుండా ఉన్న తను ఆటంకం కలుగచెయ్యడం విధ్యుక్త ధర్మంగా ఎంచిది రాణి.

"ఏమండీ...మీకు పాటలు పాడడం వచ్చునా?"

రాణి ప్రశ్నకు విస్తుపోయాడు శివర సాధారణంగా మగవాడు ఆడదాన్ని వె వలసిన ప్రశ్న రాణి వెయ్యడంలో అంతరార్థం అవమానమో ఏమో శివరాం అ చేసుకోలేకపోయాడు.

"పోనీ నేను పాడుతా...వినం శివరాం మౌనం చూసి రాణి పాట మొ లెట్టింది.

అనురాగాన్ని జ్ఞప్తికితెచ్చే ప్రేమికుల గీతి ఒకటి వినిపించింది. ఆమె గొంతు మాధుర్యమున్నా, స్వరం, రాగంతో సా లేకపోవడంవల్ల, ఆమె పాట ఎక్కువ ర్షణీయంగా లేదు శివరాంకు. అయినా క్షేపానికి బాగానేఉంది అనుకున్నా శివరాం.

పాట ఆగిపోయింది. రాణి మెల్లి నవ్వుతూ ఊరుకుంది.

శివరాం ప్రేక్షకుని సహజరీతిలో చప్ప చరిచాడు.

'నన్ను హేళన చేస్తున్నారా?' చిక్క ముఖంపెట్టింది.

శివరాం ఏదో అనబోయాడు.

'అవును నాపాట బాగా లేదు...' పాడలేను. రాణి కన్నీరు రెండుచుక్క ఉబికి ఆమె కనుకొలకుల్లో నిలచింది. క్కన చీరకొంగులో ముఖం దూర్చి క కొన్నేపు ధ్వనిచెయ్యకుండా ఏడ్చిం ముఖం తుడుచుకుని నిమీలిత నేత్రాల బరువుగా క్రిందకు చూస్తూ కూర్చు

'ఎందుకు ఏడ్చావు రాణీ' రాణి ప్రవ శివరాం దృష్టిలో నిమిషనిమిషము మెలి







—చిత్రం: కె. సత్యనారాయణ, బిలాస్‌పూర్.

ప్రత్యేక **త్రిగుణచర్యతో**

గూడియున్న **మెక్లీన్స్**

**పెరాక్సయిడ్ టూత్ పేస్టు**



చాలా బాగుగా
* శుభ్రపరచును!

1 ప్రత్యేకంగా మెక్లీన్స్‌లోనున్న 'హైపాయిద్' సాల్వెంట్ మీ పళ్ల మీద యేర్పడు చుండే–మురికిని క్రిములను గలిగియుండే పాచి పొరను నిర్మూలించును. ఈ పొరను తొలిగించుటవల్ల మెక్లీన్స్ మీపళ్లను బాగుగా శుభ్రపరచును.



చాలా బాగుగా
* తెలుపుజేయును!

2 మెక్లీన్స్‌లోనున్న ప్రసిద్ధమైన "పెరాక్సయిడ్" మీ పళ్లకు గల వికృతమైన భాగంను, గారపట్టిన రంగును తొలగించును–అందువల్ల వాటిని మెరిసేటట్లు తెల్లగా చేయును.




*
బాగుగా కాపాడును!

మీరు మెక్లీన్స్‌ను వ్యయముగా వాడి దానియొక్క సుప్రసిద్ధమైన రుచిని ఆస్వాదనమును కనుగొనండి. ఇది పంటిగుళ్లను ఉత్తేజపరచి, దంతక్షయమును కలిగించే క్రిములను నిర్మూలించును.



బాగుగా పరిశుభ్రపరచును + బాగుగా తెలుపుజేయును + బాగుగా కాపాడును.

*ఈ మూడు గుణముల సుప్రసిద్ధమైన. కూడిక మీకు త్రిగుణ చర్యను గలిగించును, ఇది మెక్లీన్స్‌లో మాత్రమే ఉన్నది!*

**అతి శుభ్రమైన, అతి తెల్లని, అత్యారోగ్యవంతమైన పళ్లకోసం·· నేడే మెక్లీన్స్ కొనండి!**

# ★ అన్వేషణ ★

తిరిగుతున్న ఒనిపించింది.

"ఏమండీ నాబొమ్మ ఎప్పుడు వేస్తారూ?" ఎషయం మార్చింది రాణి.

"నా చిత్రలేఖనం నీ పాటలాగే ఉంటుంది!"

'పానీలెద్దురు ... అందరు నాలాగే డొక్కులా ఉండాలేమిటి' లేచి ఒయ్యారంగా చీరకొంగు చేతితో ముడి వేసుకుని కులుకుతూ నవ్వింది రాణి.

"అయితే మీరు ఎప్పుడు వేయమంటె అప్పుడు వేస్తాను...మా యింటికి వచ్చి జాగ్రత్తగా రెండు గంటలు కూర్చుంటే మీ సైజు బొమ్మ గీసి యిస్తాను...మా అమ్మ తాతయ్య కూడా యిక్కడే ఉన్నారు......నిన్ను ఒక్కసారి వాళ్లకు పరిచయం చేస్తాను!" శివరాం ఆపాడు తన మాటలు. రాణి శివరాంవైపు నిశితంగా ఒక క్షణం చూసింది.

'వేళాకోళంగా అడగాను...నా ప్రతుక్కు బొమ్మలు గీయించుకోడం కూడానా......ఎందుకులెండి?" పెదాలు విరుచుకుని, లీలగా యింటి పైకప్పు చూస్తూ కనుబొమలు ఎగుర వేస్తూ నవ్వింది రాణి. ఆమెలో కనిపించిన నిర్లక్ష్యమైన నిరాశ శివరాంను చకితుణ్ణి చేసింది.

'ఏమండీ!...యింక మనం యిదరంకలిసి నాటకాల్లో వేయడం పనదు."

శివరాం నిర్ఘాంతపోయాడు.

'ఏమిలేదు పరమహంసగారు యీ మధ్య గానక చేరీలు ఎక్కువ చేస్తున్నారు...... సరళ అనే ఒక అమ్మాయి చాలా బాగా పాడుతుందిలెండి...ఆమె గానం చూసి ఆయన ముగ్ధులైపోతున్నారు!

రాణి మాటల్లోని వ్యంగ్యం శివరాం గుర్తించాడు.

పరమహంస ఆకస్మికంగా రాణి యింట్లో ప్రత్యక్షమయ్యాడు.

'బాగుంది...ఇద్దరూ యిక్కడే ఉన్నారన్నమాట...నాకు శ్రమ తప్పింది.!" నవ్వుతూ పరమహంస వారివైపు నిశితంగా చూశాడు.

శివరాం కంగారు పడ్డాడు, కొంచెం పరమహంస సంభాషణ విని. రాణి నిర్లక్ష్యంగా నిర్భయంగా మామూలుగా ఎదురేగి పరమహంసకు నమస్కరించింది.

'రాణీ!...యిదిగో పుస్తకం...మీ యిద్దరూ ఎల్లుండి నాటకానికి తయారు కావాలి... నేను వెళ్లిపోతున్నా......ఒక చోట గానకచేరీ ఉంది ఈ వేళ!" పరమహంస చిరునవ్వుతో తృటిలో నిష్క్రమించాడు.

బల్లమీద విసిరిన నాటకం పుస్తకం, విడి కాగితాలు గాలిలో రెపరెప శబ్దాలు చేసుకుంటూ గడియారం టిక్కు టిక్కు ధ్వనులకు తాళం వేస్తోంది.

పరమహంస పరుగుచూసి రాణి విచిత్రంగా భుజాలు ఎగరవేసుకుని పెదాలు విరుచుకుంది.

వెళ్ళిపోయిన పరమహంస మళ్ళీవచ్చి రాణీ యీ పొట్లం...నీకివ్వాలనుకుని మర్చిపోయాను...! అంటూ కంగారుగా రాణి చేతిలో పెట్టి మళ్ళీ పరుగులో అదృశ్యమైపోయాడు.

పొట్లం విప్పింది రాణి.

జహాంగీరు, లడ్డూ, పాలకోవా ... తీపి పదార్థాలు చూడగానే రాణీ నోరూరింది.

'సగం మీకు...సగం నాకు!" రాణి సగం శివరాం చేతిలో ఉంచింది. మర్యాదకు తినక తప్పలేదు శివరాం. పరమహంస పెద్దరికంలో అతని చనువుకు అపార్థాలు అణగిపోయాయి.

తీపితినడం పూర్తిచేసి, పరమహంస నాటకం కాసేపు యిద్దరూ దండకంలా వల్లించారు. శివరాం వెడతానంటూ లేచి నిలబడ్డాడు.

'మళ్ళీ ఎప్పుడు దర్శనం?" రాణి ప్రశ్నించింది.

'నిత్యమూ!' నవ్వాడు శివరాం.

'సత్యం?' నవ్వింది రాణి.

శివరాం తల ఊపాడు. వెళ్ళిపోతున్న అతనివైపు తదేకదృష్టితో చూసి రాణి దిగులుగా యింట్లోకి నడిచి మంచం మీద బోర్లగిల వాలిపోయి విచారంగా నిట్టూర్చి కాస్సేపు కన్నీరు కార్చింది.

రాణి ప్రవర్తనలో భావతరంగాలు మెలికలు తిరిగి హఠాత్తుగా నిమ్నోన్నతాలదశలు ఏర్పరుచుకోడం శివరాం స్పష్టంగా ఆనాడు గమనించాడు. ఆమె జీవితాన్ని అన్వేషణ చెయ్యడంలో తనకు కొంత పరమార్థంలభిస్తుందేమో అని ఆలోచనలో పడ్డాడు శివరాం.

వీధిలో బస్సుస్టాండువైపు నడుస్తున్న శివరాంకు ఎదురుగా వచ్చి ఒక రిక్షా ఆగింది.

"ఏయ్ స్వామీ!" కాకీటోపీ తగిలించుకుని, చేతిలో వానకు తొడొక్కునే కోటు వేలాడించుకుంటూ రాజారావు నవ్వుతూ శివరాం ఎదురుగా నిలిచాడు.

(ఇంకావుంది)



సం లాస్ట్ అవర్ జరుగుతోంది. సంతా నిశ్శబ్దంగా ఉంది. ఫిజిక్స్ పాఠం చెప్పుకుపోతోంది. నే కూర్చొన్న మాధురి సీరియస్‌గా చదువుతోంది. దానికదో జబ్బు. క్లాస్‌లో సబ్జెక్టు లెక్కలు చేయడం దాని హాబీ. లో ప్యూన్ ఓ చీటీ తెచ్చి లెక్చరర్ అవిడ గంభీరంగా "శారదా రాజ్యలక్ష్మి" అని చదివి, మని తను బోర్డు వైపు తిరిగి .

క్లాసులోంచి బయటపడి రాజ్య రి దగ్గరకు వెళ్లాను.

నన్ను చూసి "చూడు శారదా! వల్ సర్వీస్ లీగ్ కేంప్ కెపు ం వేద్దాం. మెంబర్సుని అందర్నీ చెప్పు. నేను లిస్ట్ యిస్తా. కావలసిన ర్నీ తెప్పించు. లీడర్‌వి కనుక ఈ ను ఎట్లా నెరవేరుస్తావో!" అన్నారు.

గారం నాడు సోషల్ సర్వీస్ ం అంతా బస్సుస్టాండ్ వద్ద చేరాం. కీర్తిలత, మాధురి, రవిప్రభ, త్ర, విజయకుమారి, సరోజిని గల మా సభ్యురాళ్ళు ఓ పదిహేను జ్యలక్ష్మిగారి అధ్వర్యాన ఎట్లా ం బస్సెక్కాం. తోట్రేకు వెళ్ళే షం. టిఫిన్ బుట్టా, ప్రొజెక్టరూ నూ, డి. డి. టి పౌడరూ అవీ గయితే శాల్తీల సామాను. ఆసంగ మొదటి కేంప్ అదే నేమో, అంతా ంగా వున్నారు.

బస్సు కొంతదూరం పోయి హఠాత్తుగా ఆగిపోయింది. కండక్టరు నీళ్ళు నములుతూ "బైరు పేలిం"దని చల్లగా చెప్పేడు.

"హా చంద్రమతీ!..." అంటూ రాజ్యలక్ష్మిగారి కళ్ళజోడు చూసి ఆగిపోయింది కీర్తిలత.

రాజ్యలక్ష్మిగారు తను నూలకాయాన్ని ముందుదించి "అమ్మాయిలూ! సామాను తీసుకుని దిగండి" అంటూ ఆజ్ఞాపించేరు.

"చచ్చేం భగవాన్! పదిగంటల ఎండలో నడవాల్సిందేనా?" అనుకుంటూ దిగేం.

అదృష్టవశాత్తూ ఓ కాళీవేన్ ఆ దారినే పోతోంది, మేమంతా రాజ్యలక్ష్మిగారిని తిట్టుకోకుండా.

ఆవిడ దాన్ని పిల్చి మమ్మల్ని దానిలో కూరి, తనూ ఎక్కేరు.

అసలే గతుకులరోడ్డు. పైగా డొక్కు వేన్: ఎట్లాగయితే నేం గమ్యస్థానం చేరాము.

పన్నెండుకూ పదినిమిషాలు తక్కువ చూపుతోంది వాచీ.

ఇక సాంఘికసేవ మొదలెట్టాలి కాబోలు అనుకుంటూ దిగి దిక్కులు చూస్తున్నాం.

మాలో కొంచెం నూలబాలఅయిన సత్యవతి ఆ ఎండలో ఆపసోపాలు పడుతోంది.

చివరకు ఓ మర్రిచెట్టు క్రిందకు చేరేం అంతా. రాజ్యలక్ష్మిగారూ, నేనూ కలసి ఊళ్ళోకి వెళ్ళాం. వెళ్ళగానే ఓగృహస్థుకు మేం వచ్చిన పని తెలియచేసుకొన్నాం. ఆయన చెప్పిన జవాబువినగానే నాగుండెల్లో రాయిపడింది. ఆవూళ్ళో రెండుపార్టీలుట. కరణానిదొకటి. మునసబుదొకటి. మేం కనుక ఏపార్టీని ఆశ్రయించినా, రెండో వారు రారు.

రాజ్యలక్ష్మిగారు తెలిసినయినది కనుక తను కరణం గారింటికి వెళ్ళి నన్ను మునసబు గారింటికి వెళ్ళమన్నారు.

నేను మా తాత్కాలికమైన బస (మర్రిచెట్టు) వద్దకు వచ్చి రవిప్రభను సాయం రమ్మన్నా. మేమిద్దరం మునసబు గారి లోగిలి కనుక్కొని వెళ్ళేసరికి ఆయన పనిమీద బస్తీ (మాఊరే) వెళ్ళారని తెలిసింది. తెల్ల మొహాలు వేసుకొని రాజ్యలక్ష్మిగారిని వెతికి పట్టుకున్నాం.

"మరండీ! మునసబుగారేమో ఊళ్లో లేరుట. అయినా మేడమ్! లేకపోతే నే మంచిది కాదండీ. ఉన్న ఓపార్టీ ద్వారానే పనులు చేసుకోవచ్చు" అన్నా ఉత్సాహంగా.

"శారదా! అధిక ప్రసంగం చెయ్యకు. వెళ్ళి అందర్నీ ఈ యింటికి తీసుకురా" అన్నారు.

'హతోస్మి!' అనుకొన్నా.

మా ముఠా అందర్నీ వెంటేసుకొచ్చా.

మధ్యలో వాసవి ఓ లేగదూడను చూసి ముచ్చటపడి ముద్దెట్టుకోబోయేసరికి దాని తల్లి పోట్లాటకొచ్చింది. వాసవి ని కడ మాయించా లీడర్ నికదా అని.

అది వెంటనే "ఏడిశావ్" అంది.

చప్పున నోరుమూసుకొన్నా.

అందరం కరణంగారి సావిడిచేరేం.

నేను గబగబా అందర్నీ మూడుభాగాలుగా విడకొట్టాను. రాజ్యలక్ష్మిగారు కంగారుపడిపోతున్నారు. అప్పటికే పన్నెండున్నర అయింది. ఇంతవఱ్కు చేసిదేమ్మను! కీర్తిలత నాయకురాలుగా ఓ జట్టుని ఉరికుభ్రతకు పంపి, మరికొందర్ని కుట్లు నేర్పమని పంపేము. విలుగు దానికి అధ్వరం వహించింది.



# సోషల్ సర్వీస్

నంబూరి సుశీలాదేవి



నేను, సుహాసినీ, రవి ఇంకో ముగ్గురం ఊళ్లో ప్రచారానికి వెళ్ళేం.

ఊళ్ళో నాలుగయిదు వీధులున్నాయి. మేం తిన్నగా ఒక వీధికి వెళ్ళేం.

అక్కడ ఒక యింటిముందర కొందరు కూర్చొని ముచ్చట్లాడుకొంటున్నారు. మేం అక్కడకు వెళ్ళేం.

ఆ స్త్రీఅమ్మాయిలనుచూసి వాళ్ళు మొహాలు చూసుకొంటున్నారు.

నేను మెల్లగా "ఏమమ్మా! మీరంతా ఈ ఊరువారేనా?" అన్నా.

"లేకుంటే యిక్కడెందుకు కూచుంటాం" అందో కావిడ.

అది అమాయకత్వమో, వ్యంగ్యమో తెలియలేదు నాకు.

"మీరు పట్టంనుండొచ్చురా?" అంది ఓ పడుచు.

"అవును. అసలు మేం వచ్చినపనేమిటో వినండి. మేం సాంఘికసేవ చేద్దామని వచ్చేం. అంటే మాకువచ్చిన కుట్లూ, చదువూ అదీ పల్లెటూళ్ళలో వున్న వాళ్ళకు చెప్పాలని మా ఆశయం. మన గవర్నమెంటువారు కొన్ని సంస్థలుకూడా పల్లెటూరివాళ్ళ బాగుకై పెట్టేరు" అంటూ నేను చెప్ప బోయేను.

"అల్లయితే మీకు జీతంగినా వుంటదా" అంది వాళ్ళలో ఒకామె.

"అబ్బే! మేం పట్నంలో ఆడపిల్లల కాలేజీలో చదువుకుంటున్నాం. మేం సరదాకొద్ది చేరేం. అంతేకాని మాకేం డబ్బివ్వరు" అన్నాను.

"మీ రెక్కడదిగారు?" అని ఒకావిడ ప్రశ్న.

"కరణం గారిసావిట్లో" అంది జయ.

"మేం కరణంగారి మడుసులం కాదు. మునసబుగారి కిందివోళ్ళం. అక్కడికెట్లా వస్తాం!" అందావిడ.

సుహాసిని ఆమెతో అంది.

"చూడండి! మాకీ పార్టీలతో ఏం పని! మేం చదువుకొంటున్నాం. మా కొచ్చిన విద్యల్లో మీకు కొంత పంచడానికి కదా మేం వచ్చేం" అంది.

"పచ్చి అబద్ధం, సర్టిఫికెట్ కోసం" అంది రవిప్రభ నా చెవిలో.

"నేను రవిని గదిమాయించాను ఊరుకో మని.

"అవును. అందుకే ఇక్కడకు వచ్చి చెప్పండి నేర్చుకొంటాం" అంది మెదర్జాగా గోడకు ఆనుకొని.

"అది కాదమ్మా! మేం సాయంకాలం వరకే వుంటాం. అందరికీ ఒకచోట నేర్పడం మాకు సులువు కాని యింటింటికి తిరిగి చెప్పడం సాధ్యమా? పైగా టైం చాలదు" అంది రవిప్రభ.

"ఇదిగో! బొత్తి ఈ కాసింత పొద్దులో ఏళ్ళేం నేర్చుకొంటారు? నువ్వేం చెప్తావు అయినా పనీ పాటా లేక ఏంకుట్లు? మీ రెల్లిపొండి. మావోళ్ళు రారు" అందో ముసలమ్మ.

సుహాసిని మండిపడింది. దాని నోరు నొక్కి నేనన్నాను?

"మేం పనిలేక రాలేదమ్మా! మాకొచ్చినవి మీకు నేర్పడానికి వచ్చేం. మా కింగువల్ల ఎంత చగువు పోతుందో తెల్సా" అన్నాను.

ఆమె కొంచెం తమాయించి,

"అట్లైతే ఈ అరుగుమీద చెప్తే నేర్చుకొంటాం" అంది అక్కడికి వస్నేదో ఉద్ధరిస్తున్నట్లు.

"అట్లా కుదరదు. వస్తే కరణంగారి సావిట్లోకి రండి." అన్నా టైం అయిపోతోందనే తొందరలో.

ఒకామె మూతి విరుచుకొంటూ "ఏదో మీరంత అడిగేరు కాబట్టి వొప్పుకున్నాం కాని అక్కడకయితే రాము" అంది.

రవి-చిరాగ్గా "పోనీలేమ్మా! ఇంకా ఊళ్ళో మనుషులున్నారు. వస్తే అక్కడకురండి. లేకపోతే మానేయండి" అని.

"రాణీ! కారదా ఒకింటి దగ్గర యింత సేపుంటే యింకా మిగతాయిళ్ళు కాన్వాస్ చెయ్యొద్దు" అని నాచెయ్యి పట్టుకొని లాక్కుపోయింది.

మావాళ్ళు కొంచెం ఆశాభంగం పొందేరు. రవి తన చలాకీమాటలతో కొద్దిసేపటికి వాళ్ళలో స్తబ్ధత పోగొట్టింది.

ఇంకోక యింట్లో మా మాటలే వినిపించుకోలేదు. నాచీర చెరగు నాణ్యం చేయసాగింది ఒకావిడ. మరొకామె జయ నెక్లేస్ ఎన్ని సవర్ను లయిందో అడుగుతోంది. ఇంకో కావిడ రవి బారెడు జడనిచూసి ముచ్చట పడసాగింది. వాళ్ళని వదల్చుకుని బయటపడే సరికి తాతలు దిగొచ్చారు.

తర్వాత యింట్లో మమ్మల్ని ఆట్టే శ్రమ పెట్టలేదు. ఆ యింటావిడ "అట్లాగే వస్తాంలే తల్లీ! అవును కాని మీరు పెళ్ళి పేరంటం లేకుండా యిల్లా వచ్చేరు, మీ పెద్దవాళ్లు ఊరుకొన్నారా?" అంది.

నే నేం మాట్లాడలేదు.

రవి అందుకొని "లేదండీ! మా ఆరుగురి లోనూ నలుగురికి పెళ్ళయిపోయింది.

# ★ సోషల్ సర్వీస్ ★

మిగతా యిద్దరికీ కుదిరిపోయింది. మావాళ్ళనో యింకోకళ్ళకు మేలు చేస్తామంటే యిట్లా పంపేరుకాని అచ్చే బస్సులో మమ్మల్ని రిక్షాలో కాలేజీకి తప్పితే ఎక్కడకూ పంపరు," అంది వంగనాచి తుంగ బొమ్మలా మొహంపెట్టి.

ఆవిడ మొహం విప్పారింది: "అల్లాగే తల్లీ! మా పెద్దపిల్లలిద్దరూ వస్తారే. దాహం కావాలా అమ్మా" అంది అభిమానంగా.

"వద్దండి!" అని వీథిలోపడ్డాం, మంగళసూత్రాలు చూపించమని అడగనందుకు సంతోషిస్తూ.

నేను రవిని కేకలువేశాను ఆ బుకాయింపేమిటని. అది నవ్వుతూ "డియర్! కొన్నిచోట్ల అట్లా కొయ్యాలి. లేకపోతే పని సానుకూలపడదోయ్. ఎప్పుడో భవిష్యత్తుని వర్తమానం చేశాను అంతేగా!" అంది.

అంతా నవ్వేరు.

ఒంటిగంటన్నర అయ్యేసరికి ఎల్లాగయితేనేం ఓ యిరవై మున్పైమందిని పోగుచేశాం. వాళ్ళని మా బసవద్దకు వెళ్ళమని మా మిగతా జట్టుల్ని వెతకడానికి బయల్దేరేం.

మావాళ్లలో మొదటి ఉత్సాహం చచ్చిపోయింది. ఆ ఏడాదీ కాలేజీలో అడుగుపెట్టిన పార్వతి "ఏమండీ! సోషల్ సర్వీస్ అంటే యిదేనా? మీరు నాలుగేళ్ళనుండి కేంప్సుకి వెడుతున్నారుకదా? యింతేనా?" అంది నిరుత్సాహంగా.

"కొండొకచో నిరుత్సాహంబు తప్పదు" అంది తెలుగు బియ్యే చదువుతున్న సుహాసిని.

మేం వీథి మలుపు తిరిగేసరికి నిర్విణ్ణులమయాము. అక్కడ కీర్తిలతకీ ఆ ఊరామెకూ హోరాహోరీ యుద్ధం జరుగుతోంది.

కీర్తిలత "నీ తాహతెంత? నువ్వెంత? నే నేం నీదానిదాన్నా? నీయిల్లు శుభ్రపర్చడానికి," అంటూ ఆయాసపడుతోంది.

డాక్టరుగారి ఏకైకపుత్రిక. మాటంటే పడదు కీర్తి. నేను చప్పున కీర్తిచెయ్యి పట్టుకొని,

"ఊరుకోవే లతా!" అన్నా.

అది ఒక్కసారి నాచెయ్యి విదల్చుకొని నామీద మండిపడుతూ "అసలు నీవల్లే యిదంతా వచ్చింది. వెఫవలీగ్‌లో చేరనంటే చేర్పించావు. నానావాళ్లతోటి మాటలు పడాల్సి వస్తోంది," అంది చేతికంటిన డి. డి. టి. పౌడర్ దులుపుకొంటూ.

"అసలేం జరిగింది" అన్నా.

కీర్తి బృందంలోని సరోజిని "అది కాదండీ! శారదా! మేము వీథిలోని మరికొంటలో డి. డి. టి. పౌడర్ సున్నం జల్లుతూంటే యీవిడ వెటకారంగా 'మా వంటిల్లు శుభ్రంగాలేదు. కొంచెం జల్లు' అంది. దానితో కీర్తిలతగారికి కోపం వచ్చింది" అంది.

నేను శాంతంగా కీర్తితో అన్నాను.

"లతా! మనం కాలేజీతరఫున వచ్చాం గాని వ్యక్తిగతంగా రాలేదు. కాలేజీపేరు నిల్పడానికే నా ఓర్పు చూపించు" అన్నా.

దానితో కీర్తి చల్లబడిపోయి "అది కాదె శారదా! గబుక్కున హీనంగా మాట్లాడితే భరించడం ఎట్లా" అంది. వాళ్ళను అక్కడకు ఆపమని అంతా మా బసకు తిరిగి వచ్చేం.

అక్కడకు వచ్చేసరికి మామూడో బృందం వచ్చిన వాళ్ళకు కుట్లు అవీ నేర్పుతున్నారు. మరికొందరు పిల్లలకు స్వీట్స్ పెట్టి, పుస్తకాలు చూపించి, కథలు చెప్తున్నారు. కొంచెం మనస్సుకు శాంతి లభించింది. ఏదో కొంచెమేనా పని జరుగుతోంది కదా అని.

రాజ్యలక్ష్మిగారు మమ్మల్ని చూసి "ఏమిటర్రా! మొహాలు ఎందుకి మాడిపోయాయి. ముందు టిఫెన్ తీసుకోండి. తర్వాత చెయ్యొచ్చు అవీ! రా వడ్డించెయ్ శారదా! అసలే ఎంతో బలమైనదానివికూడాను. ముందు టిఫెన్ తినమ్మా" అంటూ హడావుడిగా మమ్మల్ని కూర్చోబెట్టేరు.

టిఫెన్ తింటూ రవి "ఏవిటండి! మేడమ్ గవర్నమెంట్ డబ్బువేస్తు చెయ్యడం తప్పితే ఒక్కళ్ళూ ముందుకురారు" అంది.

కీర్తి వెటకారంగా "ఏమోయ్! శారదా! కథల్లో పల్లెటూరివాళ్లను అమాయకులుగా నో ట్లో వేలుపెడితే కొరికలేనట్టుగా వ్రాస్తావ్! మాకావుగా వాళ్ళ అమాయకత్వం" అంది.

రాజ్యలక్ష్మిగారు వెంటనే అన్నారు.

"ఏంమార్పువచ్చినా ఒక్కసారి రాదు. ఇప్పుడీ సోషల్ సర్వీస్ వేస్టుకింద అనిపించినా ముందుముందు పల్లెలుబాగుపడతాయి" అన్నారు.

మేం కబుర్లు చెప్పుకుంటూ టిఫెన్ ముగించేసరికి మూడున్నర అయింది.

ఊళ్ళోవున్న పిల్లలందరికీ రాత్రి బయస్కోపు వుందని చెప్పివచ్చాం.

సాయంత్రం ఐదువరకూ వచ్చిన ఆడపిల్లలకుకుట్లూ అవీ చెప్పేం. చాలాత్వరగా చనువు అయిపోయేరు చాలామంది.

సాయంత్రం ఐదు అయింది.

రాజ్యలక్ష్మిగారు నాతో "చూడు శారదా! స్లైడ్సు చూపించేసరికి ఏడవుతుంది. మనం బస్సెక్కి మన వూరు చేరేసరికి కనీసం ఎనిమిదిన్నర అవుతుంది. ఏమంటావ్" అంది.

మా మెంబర్స్ అంతా తెల్ల మొహాలు వేసేరు. "బాబోయ్ తొమ్మిదే!" అంది రవి.

సరేనని వచ్చేం ఆవిడవద్దనుంచి.

వెలుగు "నేను మలేరియా స్లైడ్ చూపిస్తాను" అంది. రవి "నేను ఎక్స్‌ప్లెయిన్ చేస్తా" అంది.

ఇంకొకళ్లకు మశూచి, కలరా వియిచ్చేను. కొందర్ని జనం అల్లరి చేయకుండా వలంటీర్లుగా ఉండమని, కొందర్ని ప్రార్థన చేయమన్నాం.

సాయంత్రం మాకు బలే ఆశ్చర్యం వేసింది. కుట్లు చెప్తామంటే పనేమిరా అన్నారు. చదువు చెప్తామంటే వేళాకోళం చేశారు. శుభ్రత బోధిస్తే కరవొచ్చారు "బయస్కోపు" అనేసరికి ఇంతమంది ఎట్లా వచ్చారా అనిపించింది. ఇసక వేస్తే రాలకుండా జనం సావిడి అంతా నిండిపోయేరు.

పెట్రొమాక్సు లైట్ తెప్పించి కరణంగారింటి వద్దనుండి. ముందు మలేరియా స్లైడ్స్ వేస్తున్నాను.

నేను స్క్రీన్ వెనక నుంచొన్నా.
ముందు జనంలో కలకలం.

నేను గబగబా ముందుకు పోయి చూశా. నాకే నవ్వాగలేదు. స్లయిడ్ తిరగేసి వేసింది వెలుగు.

డాక్టర్ తల్లక్రిందులు అయ్యేడు. రోగి పైనుండి పడిపోతున్నట్లు బొమ్మపడింది.

వెళ్ళి సరిచేశాం.

ఏం గొడవలేకుండా చాలా మటుక్కు అయిపోయేయి. ఇంతట్లో కొందరు లేచి వెళ్ళిపోయారు. నేను పోతున్న వాళ్ళను ఆపి అడిగాను.

ఒకతను "నాగేస్సర్రావు సెంటాడేమో అని వచ్చాం" అన్నాడు.

ఇంకొకడు "ఛూ! ఈ మందులు, ఇండవన్లూ ఎవడిక్కావాలి. కేలంగోడున్నాడేమో అనొచ్చాం కాని. రాండ్రా! పనీ గట్రా లేపోతే సరి" అన్నాడు.

నేను తెల్లబోయాను. వీళ్ళు "బయస్కోపు" అంటే అర్థం మామూలు సినిమా క్రింద తీసుకొన్నారని అర్థం చేసుకొన్నా.

లేచినవాళ్ళు లేకగా ఉన్నవాళ్ళకే మిగతావి చూపించి, జనగణమన పాడేసేం.

ఇంతలో మునసబుగారొచ్చేరు, కాఫీలు పట్టించుకొని.

"నేనూళ్ళో లేను. లోటు జరిగితే క్షమించండి" అన్నారాయన.

"ఉన్న వాళ్ళు చేసింది చాలక! నువ్వూ కూడానా మహానుభావా" అనుకొని ఆయన తెచ్చిన వేడి వేడి కాఫీ తాగి కొంచెం సత్తువ తెచ్చుకొన్నాం.

పాపం! మొత్తానికి సేంకుకి మునసబూ, కరణం యిద్దరూ వచ్చి ప్రెసెంటించారు మమ్మల్ని.

ఊరు చేరేసరికి తొమ్మిదయింది. రాజ్యలక్ష్మిగారి దగ్గర శెలవు తీసుకొని యిళ్ళకు పోతూం ఆలస్యంగా వచ్చినందుకు అమ్మమ్మ పెట్టిన తిట్లూ, అలసి వచ్చినందుకు అమ్మ పెట్టిన వేడి అన్నాన్ని కలిపి తింటూ ఆరోజు చేసిన సాంఘిక సేవను మననం చేసుకోసాగేను. 

# మరిది తెచ్చిన మార్పు

కొత్తపేట

చి॥ సౌ॥ చెల్లెలు కాంతకు,

అక్క ఆశీర్వదించి వ్రాయునది.

నీ ఉత్తరం అంది నాలుగు రోజులయింది. అప్పటినుంచీ జవాబు వ్రాద్దామనుకుంటూనే వున్నాను. కాని నేటివరకూ తీరిక కాలేదు. మీ బదిలీ ప్రయాణం క్షేమంగా జరిగిందని తెలుసుకొని సంతోషించేను. పెనుగొండ నీళ్లు నీకు కొత్త చేస్తాయేమోనని భయపడ్డాను. కాని మీరంతా కులాసాగా ఉన్నారని చదువుకొని ఆనందించేను. నన్నొకసారి చూడ్డానికి రమ్మనమని వ్రాసేవు. అక్కడ మీరింకా స్థిరపడడానికి కొన్నాళ్లు పట్టుతుంది కదా. ఈ లోపులో మా పిల్లల పరీక్షలు కూడా పూర్తవుతాయి. అప్పుడు తప్పక వస్తాను.

మీ ఆయన మమ్మల్ని మరచిపోకుండా ఈ ఆహ్వానం పంపినందుకు సంతోషించేమని చెప్పు. మరీ మరీ అడిగేనని కూడా చెప్పు. కొత్త ఊళ్లో ఉద్యోగాన్ని గురించి ఆతనేమంటున్నారు? ఆ వూరి విశేషాలు కూడా వ్రాయి.

బుజ్జాయికి నా ఆశీర్వచనాలు. అన్నప్రాశన ఎప్పుడు చేస్తారు? వాడికెన్ని పళ్లు వచ్చాయి? మా చిట్టి కిప్పుడే పళ్లు



వస్తున్నాయి. లోపే నోట్లో నియ్యాని గిరజల్లాగ కొద్దిగా కనిపి స్తున్నాయి. అది చేసే అల్లరి ఇంతా అంతా కాదు. అందర్నీ నోట్లో వేలుపెట్టమని మారాము చేస్తుంది. మొన్న మా మరిది కాలేజీ సెలవులకి ఇంటికి వచ్చినప్పుడిల్లానే వేధించుకు తింది. మేమా వద్దంటున్నా వినకుండా అతను నోట్లో వేలు పెట్టే టప్పటికి మామూలు ప్రకారం కటుక్కున నొక్కింది. అసలే విసుగు మనిషి, అతనే మంటాడో అని మేం భయపడ్డాం, కాని అత డెంతగా మారిపోయాడో. ఎంత విజ్ఞానవంతుడయ్యాడో చూస్తే ఆశ్చర్యం వేస్తుంది. నీకు తెలుసుకదా, ఎప్పుడూ పెంకితనంగా చిరాకుగా కిల్లా వుండేవాడో! ఇప్పుడంతావేరు. చిట్టిని ఒళ్లో కూర్చోబెట్టుకొని బోలెడంత సేపు ఆటలాడేడు. చిట్టికి ఆహారంలో తగినన్ని విటమినులు లభించడం లేదనీ పెరుగుదల రోజులలో విటమినులు శరీరానికి ప్రత్యేకించి అవసరమనీ అన్నాడు "ఇంకా పట్టా పుచ్చుకోవడానికి ఏడాది వుండగానే డాక్టరులాగ మాట్లాడకోయ్" అని నేను వేళాకోళం చేసేను.

మరునాడు నాకు కొంచెం సుస్తీగావుండి వంట చెయ్యలేక పోయాను. మీ బావగారు హోటలు భోజనం తెప్పించమని తమ్ముడికి పురమాయించేరు. "నేనుండగా హోటలు భోజనమా?" అంటూ అతను వంటకి పూనుకొన్నాడు. పట్నంలో భోజనం



పడక అతనూ కొందరు కాలెజీ కుర్రాళ్లూ కలసి "మెస్" ఏర్పాటు చేసుకొని వాళ్లకు కావలసిన వంటకాలు కావలసినట్లు చేసు కొంటున్నారట.

తర్ఫీదు బాగానే అయ్యేదేమో, వాళ్ల అన్నగారు అతని వంటని ఒకటే మెచ్చుకోవడం.

మర్నాడు మా మరిది వంటింట్లో నా దగ్గరే వుండి వంటలో తాను అనుభవం మీద నేర్చుకున్న అనేక విషయాలు చెప్పేడు. నాకు చాలా చిన్నతనం వేసింది. చెప్పొద్దూ! మరిది చెప్పడం, నేనలా చేస్తూండడం, మీ బావగారు మధ్య మధ్య నన్ను వేళాకోళం మాటలంటూండడం! — అల్లా నడిచిందా వేళ వంటింటి వ్యవహారం. అతను ప్రతిదానికి 'డాల్డా' వాడడం చూస్తే నాకుమల్లె మా వారికి ఆశ్చర్యం వేసింది. మా ఇంట్లో అంతవరకూ 'డాల్డా' పిండి వంటలకి మాత్రమే వాడే వాళ్లం. మా మరిది, మన రోజూ ఆహారంలో తగినంతగా పోషక పదార్థాలుండాలనీ, 'డాల్డా' శరీరారోగ్యానికి అవసరమైన పోషక పదార్థమే కాక దానిలో చేసిన వంటకా లెంతో స్వాదిష్టంగా వుంటాయని చెప్పేడు. ప్రతి ఔన్సు 'డాల్డా'లోనూ 700 అంతర్జాతీయ యూనిట్ల విటమిన్ 'ఎ' 56 అంతర్జాతీయ యూనిట్ల విటమిన్ 'డి' కలుపుతారనీ అందుచేత 'డాల్డా' వంట నూనెల కంటె శ్రేష్ఠమని అన్నాడు. అటువంటి 'డాల్డా' పిండివంటలకే గాక నిత్యకృత్యాలలో వంటలన్నిటికీ మహరాజులాగ వాడుకో వచ్చునని తన అనుభవం అని కూడా చెప్పేడు.

ఆహారాన్నీ, శరీర పోషణనీ, బిడ్డల పెంపకాన్నీ, గురించి కూడా బోలెడు విషయాలు చెప్పేడు. అన్నీ తెలిసియున్న మనిషి డాక్టరులాగ మాట్లాడేడంటే ఆశ్చర్యమేముంది? "ఏడాది ఆగక్కర్లేకుండానే నీకు డాక్టర పదవి ఇచ్చెయ్యొచ్చునోయ్" అన్నాను నేను.

ఈ సంఘటన వ్రాసేక నువ్వుకూడా రోజూ వంటలన్నిటికీ 'డాల్డా'నే వాడమని వేరే వ్రాయాలా? కాని ఒక్క విషయం మాత్రం గుర్తుంచుకో: విడిగా దొరికే వనస్పతిని 'డాల్డా' అని అమ్మజూపుతారు. జాగ్రత్త. అల్లాంటి వనస్పతిలో మురికి కలవడానికీ, ఈగలు వాలడానికీ, అవకాశం వుంటుంది. 'డాల్డా' మాత్రం పరిశుద్ధంగా సీలువేసిన డబ్బాలలో దొరకుతుంది. ఖర్జూరపు చెట్టు బొమ్మ వేసిన పసుపు పచ్చటి డబ్బాని గుర్తుంచుకో.

మా మరిది నేర్పిన కొత్త వంటకాలు ఈసారి వ్రాసి పంపుతాను. పెనుగొండ విశేషాలూ, మీ అందరి క్షేమం త్వరలో వ్రాయి.

మరి ఉంటాను.

ప్రేమతో మీ అక్క కమల

# రాశిఫలాలు

**దైవజ్ఞ పాతూరి శ్రీరామమూర్తి**

**28-10-1959 బుధవారం మొదలు**
**3-11-1959 మంగళవారం వరకు**

### మేషం:

(అశ్విని, భరణి, కృత్తిక 1 పా.)

ఈవారం అనేక సందర్భాలలో ఇతరుల వల్ల నిరుత్సాహం కనుపిస్తూ ఉంటుంది. బంధు మిత్రులతో స్వల్ప విషయాలలో పేచీలురాగల అవకాశాలున్నవి. స్వార్థపరులు కొంతమంది మీమీద అపవాదులు మోపటానికి ప్రయత్నిస్తారు. సాధ్యమైనంత జాగ్రత్తగా ఉంపటం మంచిది. భార్యయొక్క ఆరోగ్యం సరిగా ఉండకపోవటం వల్ల మనస్సుకు అశాంతి కలుగుతుంది. ధనాదాయం బాగా పెరుగుతుంది. కాని కొన్ని ముఖ్య సందర్భాలలో మీ ఆలోచనలకు, జరిగేదానికీ సంబంధం కనుపించదు. వృత్తి వ్యాపారాలలో క్రొత్తమనుష్యుల స్నేహం, వారివలన సహాయం పొందగలుగుతారు. ప్రసుతం జరుగుపనులు చాలావరకు ముందు రాబోవు కాలంలో ఉపయోగిస్తవి, కాని తాత్కాలిక ఫలితం ఎదురు చూడటానికి అవకాశం ఉండదు. కుటుంబంలో శాంతి లభిస్తుంది. వారాంతంలో దైవకార్యాలు జరుగుతవి. 2,8 లలో యత్న కార్యసిద్ధి, ప్రయాణసూచనలు ధనలాభం అధికశ్రమ.

* * *

### వృషభం:

(కృత్తిక 2, 3, 4, పా, రోహిణి, మృగశిర 1, 2 పా.)

అన్నిపనులు మీబుద్ధి బలానికితోడు దైవబలంకూడా కలిసిరావటంవల్ల సంతృప్తికరంగా జరుపుకోగలుగుతారు. ఇతరులుమీకు అపకారంచేయడానికి ప్రయత్నించినా మీకు లాభకరంగా మార్పు రావటం ఈ వారంలోని విశేషం. శుభకార్య ప్రయత్నాలు ఒక నిర్ణయానికి వస్తవి. వారం మధ్యలో కుటుంబంలోనివారి ఆరోగ్యం లోపించటంవల్ల కొంచెం చికాకు కలుగుతుంది. ఈ సమయంలో ఇతరులకు సంబంధించిన కార్యభారం కొంత ఉంటుందికాని, అందువల్ల మీ స్వంతపనులకు ఏవిధంగానూ ఆటంకం కలుగదు. కోర్టు కచేరీలలో అనుకూలత కలుగుతుంది. అధికారులవల్ల జరుగవలసిన పనులు చురుకుగా జరుగవు. విలాస వినోదముల నిమిత్తం ధనవ్యయం చేస్తారు. ఉత్తర దిక్కునుంచి మీవృత్తికి సంబంధించిన లాభకరమైనవార్తలు గలవు. 30, 31 లలో మానసిక ఆందోళన, చోరభయం, పొరపాట్లు చేయుటం.

* * *

### మిథునం:

(మృగశిర 3, 4 పా. ఆరుద్ర, పునర్వసు 1, 2, 3 పా.)

ఈవారం ఇతరుల విషయంలో ఎంత ఉదారంగా ప్రవర్తించినా చివరకు మీకు మానసిక విచారం, ధనవ్యయం మాత్రం తప్పవు. ముఖ్యంగా మీ స్వంత వృత్తి వ్యాపారాలకు సంబంధించిన పనులలో శ్రద్ధగా ఉంపటం అవసరం. ఇతరులసలహాలను నమ్మి కలహాలకు పోవద్దు. ఆదాయముతో పాటు ఖర్చులు కూడా పెరుగుతవి. గాని అందువల్ల ముందు ముందు ఎక్కువ అనుకూలం కనుపిస్తుంది. స్నేహితులకు సంబంధించిన వ్యవహారాలలో మీరు కొంత జోక్యం కలిగించుకోవలసి వస్తుంది. ప్రస్తుతం మీ ఆరోగ్యం కొంచెం అసంతృప్తిగా ఉన్నట్లు తోచినా మీపనులకు ఇబ్బంది కలుగదు. బంధుమిత్రుల శుభకార్యములలో పాల్గొంటారు. వారాంతంలో నీచులతో కలహాలు రాగల అవకాశాలున్నవి. సాధ్యమైనంతవరకు తొందర పడకుండా ఉండటానికి ప్రయత్నించండి. 29 30 తేదీలలో దేహ అసౌఖ్యం, దుర్వార్తలు, ఖర్చులు

> **గ్రహస్థితి**
>
> సింహ కన్యలలో శుక్రుడు, కన్యలో రాహువు, తులలో సూర్యకుజులు, వృశ్చికంలో బుధ గురువులు. ధనుస్సులో శని, మీనంలో కేతువు. సింహ కన్య తులా వృశ్చికాలలో చంద్రుడు.

* * *

### కర్కాటకం:

(పునర్వసు 4 పా, పుష్యమి, ఆశ్లేష)

మీయుక్తి బుద్ధిబలంతో మీ విరోధులను కూడా మీకు అనుకూలంగా మార్చుకుని వారివల్ల మీ కార్యం సాధించుకోగలుగుతారు. సంఘంలో మీమాటకు విలువ వస్తుంది. మీ సలహా నిమిత్తం, మీ సహాయం నిమిత్తం అనేకమంది ఎదురు చూస్తుంటారు ఇతరులవల్ల మీరు ఎదురుచూస్తున్న సహాయం కొంచెం ఆలస్యంగా లభిస్తుంది ఆదాయం బాగా పెరుగుతుంది ప్రయాణాలు శుభప్రదంగా జరుగుతవి, మీరు ఇతరులతో కలిసి చేయుపనులు ప్రస్తుతం అసంతృప్తికరంగా తోచవచ్చు, కాని అంతమాత్రంచేత నిరుత్సాహం చెందవద్దు, వ్యవహారరంగంలో అనుకూలత కలుగుతుంది. మీకంటె గొప్ప అంతస్తులో ఉన్నవారితో స్నేహం లభిస్తుంది. ఈవారం ఆరంభంలో బంధు మిత్రుల నిమిత్తం ఖర్చులు ఏర్పడుతవి. కుటుంబసౌఖ్యం బాగుంటుంది. 1 2, 3 లలో సంఘ గౌరవం శుభ పుణ్యకార్యాలు, మిత్ర దర్శనం.

* * *

### సింహం:

(మఖ, పుబ్బ, ఉత్తర 1 పా.)

అన్నిటికన్నా ముఖ్యంగా ప్రతిపనిలోను ధైర్యం, స్థిరస్వభావం, స్వంత ఆలోచన అవసరం. ఈ సమయంలో మీవృత్తి ఉద్యోగాలలో శ్రమ కనుపిస్తుంది అధికారులవల్ల కొన్ని సమయాలలో పేచీలు రాగలవు. కాని అంతమాత్రంచేత ఆందోళన చెందవద్దు. అన్నివిధాలా సమర్థులైనవారి సహాయం లభిస్తుంది. వ్యవహారవిషయాలలో మీకు అనుకూలం కనుపిస్తుంది. ధనాదాయం మామూలుగానే ఉంటుంది. కుటుంబంలోని వారితో కలహాలువస్తవి. అయితే ప్రబలం కావు. ఈవారం క్రొత్తమార్గములలో ధనాదాయం ఏర్పడగల అవకాశాలున్నవి. ఇతరుల సలహానునమ్మి విశేషధనవ్యయంతో జరుగతగుపనులు ఆరంభించవద్దు. దూరముగున్నటువంటి బంధుమిత్రులవద్దనుంచి శుభవార్తలు వస్తవి. 30,31 లలో ఖర్చులు ఎక్కువ, తొందరపడటంవల్ల చిక్కులు, పనులలో నిరుత్సాహం.

* * *

### కన్య:

(ఉత్తర 2, 3, 4 పా, హస్త, చిత్త 1, 2 పా.)

ఈవారం మీకు కొన్ని సమయాలలో పోటీలు కనుపిస్తున్నా మీ కార్యదీక్ష న్యాయబుద్ధి మిమ్ములను ముందుకు తీసుకుపోగలుగుతవి. వ్రాతల్లో విజయం సాధిస్తారు మీవల్ల ఇంతకుముందు సహాయం పొందినవారు కూడా మీ ప్రయత్నాలకు ఆటంకాలు కలుగచేస్తారు. అయితే దైవబలం మీకు అనుకూలంగా ఉండే కనుక అన్ని పనులూ సకాలంలో సక్రమంగా జరుగుతవి, ఆదాయాన్ని మించిన ఖర్చులు వచ్చి పడుతవి. వృత్తి ఉద్యోగాలలో ఉత్సాహకరంగా ఉంటుంది. సాటివారిలో గౌరవం లభిస్తుంది. దూరప్రయాణాలు చేయువలయు ననుకుంటారు, కాని ఆటంకాలు కలుగుతవి. సంతానంయొక్క ఆరోగ్యం కొద్దిగా లోపి

స్తుంది. సుబ్రహ్మణ్య స్తోత్రపారాయణంవల్ల అన్ని విషయాలా క్షేమం, మనశ్శాంతి, కార్య సిద్ధి కలుగుతవి. నూతనప్రయత్నాలకైతే ఎందర పడటం మంచిదికాదు. 28-29 లలో డబ్బు చిక్కులు, మిత్రులతో అభిప్రాయ భేదాలు.

* * *

### తుల :

(చిత్త 3, 4 పాదాలు, స్వాతి విశాఖ 1, 2, 3 పాదాలు)

ఈ వారం బాహ్యవిషయాలలో చాలా సంతృప్తికరంగా ఉంటుంది. సంఘంలో పేరుప్రతిష్టలు, గౌరవం, ధనాదాయం బాగా లభిస్తవి. బంధుమిత్రులతో ఇంతకు ముందు ఏర్పడిన కలహాలు తగ్గిపోయి మనశ్శాంతి లభిస్తుంది. మీ ఆరోగ్యం లోపించటంవల్ల ముఖ్య కార్యకలాపాలలో కొంత ఆలస్యం కనుపిస్తుంది. అంతమాత్రంచేత నిరుత్సాహం చెందవద్దు. కుటుంబంలో పుణ్య కార్యాలు జరుగుతవి. విలువగల వస్తువులు కొనే ప్రయత్నాలు చేస్తారు. మీ వృత్తి వ్యాపారాలలో ప్రస్తుతం మీరు అనుకొంటున్నంత అభివృద్ధి కనుపించదు. కాని మీ ఆడంబరానికి, గౌరవానికి లోపం రాదు. ఇతరుల సలహాలు నమ్ముకుని కార్యభారం పైన పెట్టుకొనటం మంచిదికాదు. వారంమధ్యలో పిల్లల ఆరోగ్యం లోపిస్తుంది. పదిమందికి సంబంధించిన ధర్మకార్యాలలో పాల్గొంటారు. 2, 3 లలో ఆదాయంలో వృద్ధి. శుభ వార్తలు. కోర్టుకచేరీలలో అనుకూలత.

* * *

### వృశ్చికం :

(విశాఖ 4 వ పాదం అనూరాధ జ్యేష్ఠ)

ప్రస్తుతం మీరు ఇతరుల ముఖస్తుతి మాటలకు లొంగిపోవద్దు. ముఖ్యంగా డబ్బుకు సంబంధించిన లావాదేవీలలో చాలా జాగ్రత్తగా ఉండటం మంచిది. ఇతరులమాటలను నమ్మి మీ ఆప్తమిత్రులు మీతో కలహించగల అవకాశాలున్నవి. ఈ సమయంలో ఓర్పుతో ఉండటం మంచిది. మీ స్వకీయ కార్యకలాపాలు భారంగా కనుపిస్తున్నా మొత్తంమీద చాలావరకు కార్యరూపంలోకి వస్తవి. మనస్సులో ఇంతకు ముందు ఉంటున్నటువంటి సందేహాలు, భయము క్రమంగా తీరిపోయి స్థిమితం లభిస్తుంది. వృత్తి, ఉద్యోగాలలో గౌరవం లభిస్తుంది. కాని ఖర్చులకు తగినంత ఆదాయం కనుపించదు. దూరమందున్నటువంటి బంధుమిత్రులవద్దనుంచి మీరు ఎదురు చూస్తున్న వార్తలు సకాలంలో రాకపోవటంవల్ల ఆందోళన కలుగుతుంది. 30, 31 తేదీలలో సంచారం, తలపెట్టిన పనులలో చిక్కులు, గౌరవం.

* * *

### ధనుస్సు:

(మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా)

ఈ సమయంలో పట్టుదల, ధైర్యము అవసరం. కొన్ని సమయాలలో మీ మనస్సుకు విరుద్ధమైన పనులు కూడా చేయవలసివస్తుంది. మీ వృత్తి వ్యాపారాలలో ఇతరుల సలహాలు నిరుత్సాహకరంగా కనుపిస్తవి. కాని మీరు మాత్రం నిబ్బరంగా ఉండి ఏ విషయంలోను ఎవ్వరి మనస్సుకు బాధ కలుగకుండా మీ కార్యం సాధించుకోగలుగుతారు. అందువల్ల ముందు ముందు ధనాదాయం కూడా బాగుంటుంది. కుటుంబంలో సౌఖ్యం లభిస్తుంది. అధికారులవల్ల జరుగవలసిన పనులు చాలా వరకు అనుకూలంగాజరుగుతవి. లోగడమీకు సహాయం చేస్తామని చెప్పిన వ్యక్తులు సమయంలో తప్పుకుంటారు. కాని మీ బుద్ధిబలంతో అన్ని పనులు చక్కగా సమర్థించుకుని గౌరవం కాపాడుకోగలుగుతారు. శుభకార్య ప్రయత్నాలు అనుకూలించగలవు. 29,30,31 తేదులలో వృత్తిలో శ్రమ, ధనలాభం, మిత్రులవల్ల కార్యసిద్ధి.

* * *

### మకరం:

(ఉత్తరాషాఢ 2, 3, 4 పా, శ్రవణం ధనిష్ఠ 1, 2 పా)

మీరు మీ బాధ్యతలను తగ్గించుకుందామని తాపత్రయపడి ప్రయత్నిస్తారు. కాని, అనుకున్నంత త్వరగా ఏపనీ జరుగదు. ఆదాయం బాగుంటుంది. కుటుంబంలో సుఖ సౌఖ్యాలు లభిస్తవి. వృత్తి ఉద్యోగాలలో మీరు అనుకున్నంత అభివృద్ధిగాని సుఖంగాని కనుపించదు అయితే మీ ప్రయత్నాలు విడవకుండా చేయుటంవల్ల ముందు ముందు ఫలితం బాగుంటుంది. ఈవారం ఇతరులకు హామీ ఉండటం వంటి బాధ్యతలు పైనపెట్టుకొనటం మంచిదికాదు. సంఘంలో గౌరవం లభిస్తుంది. సాధ్యమైనంతవరకు నిబ్బరంతో ఉండి మీ రహస్య విషయాలు బయటకు పోకుండా చూచుకొనండి. వారాంతంలో అకస్మాత్తుగా ధనాదాయంలభిస్తుంది. విద్యావంతుల పరిచయం లభిస్తుంది. పశ్చిమ దిక్కునుంచి లాభకరమైన వార్తలు తెలుస్తవి. మీ ఆలోచనలు కార్యరూపం పొందగలవు ప్రయాణాలుసుఖంగాజరుగవు. 1,2,3 లలో ధర్మకార్యాలు, ధనలాభం, వృత్తిలో మంచి మార్పు.

* * *

### కుంభం:

(ధనిష్ఠ 3, 4 పా, శతభిషం, పూ. భాద్ర 1, 2, 3 పా.)

ఈవారంమీకు అన్ని విషయాలలోను ప్రోత్సాహకరంగా ఉంటుంది. డబ్బు రాబడి పెరుగుతుంది. గౌరవం, పేరు ప్రతిష్టలు లభించటమే కాకుండా ఇతరుల సహాయంతో గొప్ప గొప్ప పనులు సులభంగా నెరవేర్చగలుగుతారు. ఇతరులవద్దనుంచి రావలసిన ధనం సక్రమంగావస్తుంది. కాని మొదట కొంచెం ఆందోళన కలుగుతుంది. బంధువులవద్దనుంచి మనస్సుకు ఆదుర్దాకలిగే వార్తలువచ్చి మీపనులకు అంతరాయం కనుపిస్తుంది. మీ ఆరోగ్యం, కుటుంబంలోని వారి ఆరోగ్యం బాగుంటుంది. కుటుంబంలో సుఖం లభిస్తుంది. అధికారుల సహాయంతో మీరు తలపెట్టిన పనులు సుఖంగా నెరవేరుతవి. దైవిక కార్యాల నిమిత్తం ధనవ్యయం అధికంగా చేస్తారు. మీ మంచితనాన్ని ఉపయోగించుకుని మీకు అపకారం చేయటానికి కొందరు ప్రయత్నిస్తారు. గుణగణాలు తెలుసుకోకుండా క్రొత్తమనుష్యులను దగ్గర చేర్చటం మంచిదికాదు. 2,3 లలో సభా గౌరవం, విలాసవినోదాలు, వృత్తిలో అనుకూలమైన మార్పులు.

* * *

### మీనం :

(పూ. భాద్ర 4 పా, ఉ. భాద్ర, రేవతి)

ఒకప్రక్క శ్రమ, మనస్సుకు నిరుత్సాహం, ఆటంకాలు కనుపిస్తూ ఉంటవి. అయితే ఈ సమయంలోనే తప్పక విజయం సాధించవలయుననే పట్టుదల, అందుకు తగినట్లు ఇతరుల ప్రోత్సాహం సహాయం లభిస్తు ఉంటవి. అనేక సమయాలలో మీరు ముందు అనుకోనని పనులుకూడా అకస్మాత్తుగా చేయవలసివస్తుంది. మీశక్తి సామర్థ్యాలకు తోడు దైవబలంకూడా బాగుండటంవల్ల అనేక సందర్భాలలో అనుకూలం కలుగుతుంది. ఈవారం ఆరంభంలో కొంచెం ధన కష్టం కనుపించినా రెండవభాగంలో సంతృప్తికరమైన ఆదాయం లభిస్తుంది. ఆత్మీయులతో స్వల్పవిషయాలలో అభిప్రాయభేదాలు రాగలవు. అయితే ఆరంభంలోనే తగ్గిపోయి మనస్సుకు శాంతి లభిస్తుంది. బంధువుల రాకపోకలవల్ల ఖర్చులు పెరుగుతవి. వృత్తి ఉద్యోగాలలో పాటివారివల్ల అదరాభిమానాలు లభిస్తవి. గౌరవం పెరుగుతుంది. 29,30 తేదులలో స్త్రీలతో కలహాలు, చోరభయం, అకస్మాత్తుగా అగ్నివల్లగాని, ఆయుధములవల్లగాని బాధకలుగవచ్చు. ★

# పరదేశి యుక్తి

మతుకుమల్లి విద్యాసాగర్

పూర్వం ఒక దేశాన్ని ఒక రాజు పాలించేవాడు. అతనిలో అన్నీ సద్గుణాలేగానీ చంద్రుడిలో మచ్చలాగా ఒకేఒక లోపం ఉండేది. అతనికి గల న్యాయప్రేమ ఉండవలసిన దానికన్న ఒకపాలు ఎక్కువ ఉండేది. అందువలన ఎవరూ ఏవిధమైన నేరంచేయటం సహించలేకపోయేవాడు. ఎవరూ నేరంచేయకుండా ఉండాలంటే శిక్ష కఠినంగా ఉండాలనీ, అపుడు శిక్షకు భయపడి ప్రతివాళ్లూ నేరం చేయకుండా జాగ్రత్త పడతారని గట్టిగా నమ్మాడు. కాబట్టి ఎంత చిన్న నేరం చేసినా మరణదండన అనుభవించవలసి వస్తుందనే శాసనం చేయించాడు. ఈ శాసనం ప్రజలందరికీ తెలిసేటట్లు దేశం నలుమూలలా పలకలపై వ్రాయించి నెలకొల్పాడు. ఆరాజు మరణదండన స్వయంగా అమలుజరిపేవాడు. చివరి సమయంలో నేరస్థుడు ఆఖరిమాటగా నిజం మాట్లాడితే సులభంగా మరణించేటట్లు తలవరించేవాడు. అలాకాక అబద్ధమాడితే కఠినమైన ఉరిశిక్ష విధించేవాడు. అంటే మరణించే పద్ధతి కోరుకోవటంలో నేరస్థునికి ఒక అవకాశమిస్తున్నాడన్నమాట.

రాజశాసనమని నేరం చేయకుండా జనులు జాగ్రత్త పడవచ్చు. కాని పొరపాటుచేయటం మానవ స్వభావం కదా! జాగ్రత్తగా ఉన్నా ఏదైనా చిన్న తప్పిదం జరుగవచ్చు. అంతమాత్రానికే తమ అమూల్యమైన ప్రాణం పోగొట్టుకోనేందుకు ఎవరు సమ్మతిస్తారు? కాని అది రాజశాసనం. సర్వజనరంజకుడైన తమరాజు యీ ఒక్క విషయంలో ఇంత క్రౌర్యం ఎలా వహించగలుగుతున్నాడా, అని ప్రజలు ఆశ్చర్యపడేవారు. ఏ దేవదూత అయినా వచ్చి రాజు మనస్సు మార్చాలే గాని, మానవమాత్రులకు సాధ్యం కాదని, అటువంటి శుభదినంకోసం ఆశగా ఎదురు చూస్తుండే వారు ప్రజలు.

ఒకనాడొక పరదేశి, ఆస్తినంతా అమ్మివేసి, ఏదైనా విదేశంలో స్థిరపడిపోదామని, దేశాటనచేస్తూ ఆ రాజ్యంలో ప్రవేశించాడు. సరిహద్దు దాటినప్పటినుంచీ, ఎక్కడ చూసినా "నేరంచేస్తే మరణదండన. జాగ్రత్త!" అనే పలకలే కనబడేటప్పటికి, దీని విషయమేమిటో తెలుసుకోవాలనుకొన్నాడు. రాజధానికి వెళ్ళినట్లయితే, ముఖ్యనగరం కాబట్టి, పలకలవిషయము తెలుస్తుందని రాజధాని చేరుకున్నాడు. అక్కడ కొందరు వృద్ధులు ఒక రచ్చబండమీద కబుర్లు చెప్పుకొంటుంటే, దగ్గరకు వెళ్ళి, తనకు కనిపించిన పలకలవిషయ మేమిటని అడిగాడు. వారిలో ఒకడు విషాదంతో తమరాజు క్రౌర్యంగురించి, చంపబోయేముందు అతడిచ్చే అవకాశం గురించి చెప్పాడు. పరదేశి మంచి యుక్తిపరుడు, సాహసి, బుద్ధిశాలి, మంచివాడు. ఈ రాజుకళ్ళు తెరవాలనుకొన్నాడు. వారితో "ఎలాగైనా దీనిని అరికట్టాలి" అన్నాడు. కాని వారు ఏ దేవదూతైనా వచ్చి ఆయన మనస్సు మార్చవలసిందే గాని మానవమాత్రులవల్ల కాదన్నారు. కాని పరదేశి "ప్రయత్నించి చూడాలిగదా దేనికైనా" అంటూ అక్కడనుంచి కదిలాడు. "ఈ రాజు శాసనాన్ని ధిక్కరించాలి" అనుకొన్నాడా పరదేశి నడుస్తూ. ఎలాగా అని ఆలోచిస్తుండగా ఒక చాటింపు అతనికి వినబడింది.

"ఇందు మూలముగా ప్రజలకు తెలియజేసే దేమంటే, మహారాజావారు తాము నిర్మించుకొన్న కొత్త తోటలో, 10 రోజులు బసచేస్తారు కనుక అంతవరకూ ఆ తోటలోని కెవరూ ప్రవేశించకూడదని రాజాజ్ఞ" అని ఆచాటింపు. వెంటనే పరదేశికేదో తట్టింది. ఆ తోటవైపు నడువసాగాడు. తోటద్వారాన్ని సమీపించగానే ఎవరో తరుముతున్నట్టు పరిగెత్తుతూ లోపలదూరాడు. వెంటనే రాజభటులు అతణ్ణి బంధించి



రాజుముందు హాజరుపర్చారు. రాజు అతణ్ణి చూశాడు. "నీవు చూస్తే పరదేశీయుడిలాగా వున్నావు. మీవంటి వారి ఉపయోగార్థం స్థాపించబడిన పలకలను చూడలేదా? మా న్యాయం స్వదేశీయులకు, విదేశీయులకు ఒకటిగానే ఉంటుంది. కనుక నీవుకూడా మరణదండనను అనుభవించవలసి ఉంటుంది." అన్నాడతడు పరదేశితో. వెంటనే మరణదండన ఏర్పాట్లు జరిగాయి.

'ప్రయత్నించి చూడలిగదా' అన్న పరదేశిమాటలు విన్నవాళ్లు ఇతడు రాజుకు బుద్ధిచెప్పాలనే వెళ్లాడ! రూఢిచేసుకొన్నారు. ఈవార్త నగర మంతా ప్రాకిపోయింది. అతడికి మరణదండన విధింపబడిన విషయం వింటూనే, వాళ్ళు అతి సాహసంవల్ల ప్రాణాలమీదికి తెచ్చుకొన్నాడు అని ఆ పరదేశిపై జాలి చూపిస్తూ 'వధ్యశిల' వద్ద గుమిగూడారు.

కొద్దిసేపట్లో రాజువచ్చి పరదేశిని నీ చివరిమాట ఏమిటని అడిగాడు. ఇసుకవేస్తే రాలనంత జనం. చీమ చిటుక్కుమన్నా వినిపించే నిశ్శబ్దం. అందరూ ఆత్రంగా అతడు ఏంచెప్తాడోనని ఎదురుచూస్తున్నారు. పరదేశి "నన్ను ఉరితీయబోతున్నారు" అన్నాడు. రాజు కేంచేయాలో తోచలేదు. ఎందుచేతనంటే అతణ్ణి ఉరితీస్తే అతని మాట నిజమవుతుంది. కాని అబద్ధమాడిన వాణ్ణి మాత్రమే ఉరితీయాలి. అలాకాదని తలనరికితే అతనిమాట అబద్ధ మవుతుంది. కాని నిజముచెప్పితేనే అతణ్ణి తలనరకాలి. కనుక అతణ్ణి తలనరికేందుకూ, తీసేందుకూ కూడా వీలులేకపోయింది.

రాజు అతడి తెలివికి మెచ్చుకొన్నాడు. "నీవు ఎందుకు మాశాసనాన్ని ధిక్కరించి, తప్పించుకోజూస్తున్నావ్?" అని రాజు అతణ్ణి అడిగాడు. పరదేశి ధైర్యంగా "ప్రభూ! తమ మరణదండన విధించే శాసనం ప్రజలను కష్టపెడుతోంది. కనుక దానిని రద్దుచేయమని నా ప్రార్థన" అన్నాడు. రాజుకు కనువిప్పు కలిగింది. అతడు ఆ శాసనం వలన కలిగే నష్టాలు గుర్తించి వెంటనే ఆశాసనాన్ని రద్దుచేశాడు. నేరానికి తగినశిక్ష విధింపబడుతుందని ప్రకటించాడు. పరదేశిని ఘనంగా సన్మానించాడు. ప్రజలు కొత్త పాలనలో హాయిగా ఉంటూ, తమ సౌఖ్యానికి కారకుడైన పరదేశిని వేనోళ్ల పొగిడారు. ★

## ఆంధ్ర సచిత్ర వారపత్రిక
## బాలల సంఘం
[సభ్యత్వపు దరఖాస్తు]

GROUP
A లేక B

సభ్యుని (సభ్యురాలి) పూర్తిపేరు (విడివిడి అక్షరాలలో) ....

పుట్టినతేదీ, నెల, సంవత్సరం: వయస్సు ....
తండ్రి, లేక, సంరక్షకుని పూర్తిపేరు: ....
ఊరిపేరు, జిల్లా, తాలూకా, పోస్టు [వీధి: నెంబరు] ....
* చదువుతున్న తరగతి, లేక, ఫారము: ....
పాఠశాల పేరు ....
ప్రధానోపాధ్యాయునిపేరు (తెలిస్తే):
ఆర్యా:
ఆంధ్ర సచిత్ర వారపత్రిక బాలల సంఘములో నన్ను సభ్యునిగా/సభ్యురాలుగా చేర్చుకోన ప్రార్థన. పైన వ్రాసిన విషయాలన్నీ యదార్థములు. ఇట్లు

[తేదీ: -1959] (సంతకము)

* మరొ: ఏ పాఠశాలలోనూగాక ఇంటివద్దనే ట్యూషన్ చెప్పించుకొనే బాలబాలికలు కూడా సభ్యులుగా చేరవచ్చు. 'చదువుతున్న తరగతి' అనే విషయానికి ఎదురుగా 'ప్రైవేట్ స్టడీ' అని వ్రాయాలి.

సంచిక: **28-10-59**] ఈ దరఖాస్తు **31-10-59** నాటికి మాకు చేరాలి]

# భయం అంటే?

వేల్పుచర్ల సుబ్బరామరావు

మహారాష్ట్ర దేశాన్ని నిష్కళంకంగానూ, నిత్యకళ్యాణం పచ్చ తోరణంగానూ సమర్థంగా పరిపాలించిన ఛత్రపతి శివాజీ పేరు వినని వారుండరు. ఆయనతల్లి వీరమాత జిజీబాయి. తండ్రి షాజీ. జిజీబాయి వీరమాత అనే పేరును శివాజీ బాల్యంలోనే సార్థకం చేసుకున్నది.

అది శివాజీ బాల్యావస్థ. తన తోడిబాలురైన స్నేహితులతో, కులాసాగా ఆడుకుంటూ పాడుకుంటూ నిశ్చింతగా కాలం గడుపుతున్నాడు శివాజీ. అతని మహాదాశయాలూ, కార్యదీక్ష అతని చిన్నప్పటి ఆటల్లోనే గోచరిస్తూండేవి. తన ఆశయాలకు తగినట్టే ఆటపాటలుజరుపుతూవుండేవాడుశివాజీ. తాను రాజైనట్లు, ఇతర దేశాల రాజుల్తో యుద్ధం చేసి గెలిచినట్లూ, తన దేశంలో పనిచేస్తున్న ఇతర దేశపు గూఢచారులను శిక్షించినట్లూ, తన దేశంలోని ప్రజలను స్వార్థంకోసం బలిచేస్తూ హింసిస్తున్న ద్రోహుల్ని పట్టి బంధించినట్లూ, గజదొంగల్ని వెదకి శిక్షించినట్లు ఇలా ఇంకా ఏవేవో గంభీరమైన ఆటలు ఆడుకుంటూ వుండేవాడు కులాసాగా శివాజీ తన బాల్యంలో.

తన చిన్నతనంలోనే మామూలుగా యిలాగే ఓరోజు శివాజీ ఆడుకుంటున్నాడు. తాను రాజై ఉన్నత స్థానంలో కూర్చున్నాడు. మంత్రి వేషంలో వున్న ఓకుర్రాడు దొంగ వేషంలో వున్న ఇంకో కుర్రాణ్ణి తీసుకొచ్చాడు. విచారణ జరుగుతున్నసమయంలో దొంగవేషంలో వున్న కుర్రాడు తప్పించుకుని దూకి పారిపోయాడు. ఇదంతా ముందు ఆలోచించుకున్నదే కనుక శివాజీ కూడా లేచి ఆ కుర్రాడి వెంటబడ్డాడు, ఆటమీది మోజుకొద్దీ.

ఎంత పరుగెత్తినా దొంగేమో దొరకలేదు. వాడేమో వూరిబయటి కొండల్లోకి వెళ్లిపోయాడు. తమాషాగా చిక్కకూడదని. కాని శివాజీలోని పట్టుదల మరింత తీవ్రమై అతనిమనసును ఆటమీదినుండి దృష్టి మళ్లించి ఎలాగేనా ఆ కుర్రాణ్ణి పట్టుకోవాలనే సంకల్పం కలిగించింది. అలాగే కొండల్లోకి పరుగెత్తాడు.

దొంగవేషంలో వున్న కుర్రాడు తిరిగివచ్చాడు. అతడు వచ్చింది శివాజీ గమనించలేదు. ఎందుకంటే వచ్చిందారిని కాక వేరొకదారిగుండా వచ్చాడు. 'వచ్చినదారినే యింటికి వెళ్లకపోతాడా'ని ఓగుహాద్వారం వద్ద కాచుక్కూచున్నాడు శివాజీ. క్రమంగా సూర్యాస్తమయమయింది. చీకటి కూడా పడుతోంది. కాని శివాజీ పట్టుదల సడల లేదు. 'ఇంకా చీకటిపడితే ఆ దొంగ కుర్రాడు రాకపోతాడా'ని అతని వుద్దేశ్యం.

ప్రొద్దు గుంకినా కొడుకు ఇంటికి రాకపోయేసరికి జీజీబాయి ఆందోళన ఎక్కువైంది. పైగా చీకటి కూడా పడ్డదాయె. ఏం చేయగలదు పాపం. శివాజీతో పాటు



—చిత్రం: ఐ. రమామోహన్‌రావ్, కాకినాడ.

ఆడుకుంటున్న పిల్లల్నెలాగోకలుసుకుని శివాజీ కొండల్లోకి వెళ్లిపోయాడని తెలుసుకుని మరీ కంగారు పడింది. వెంటనే ఆలస్యం చేయకుండా, లాంతరు పుచ్చుకు, నలుగురైదుగురు వెంటరాగా కొండల్లోకి బయలుదేరింది. ఎంత వెతికినా కనుపించలేదు. దిగాలుపడి తిరిగి వస్తూండగా, గుహదగ్గర కటికరాతి మీద కునుకు తీస్తూన్న కుమారుడు కనపడ్డాడు!

జీజీబాయి హృదయంలోని ఆనందం కట్టలు త్రెంచుకు ప్రవహించింది. కుమారుణ్ణి నిద్రలేపి హృదయానికి హత్తుకుంది. "ఇక్కడ కూర్చున్నావేమిటి నాయనా! పైగా నిద్రపోతున్నావు కూడను. ఇంటికి వెళ్దాం రా" అన్నది బిగ్గరగా. శివాజీ తన కథనంతా వివరించి దొంగకుర్రాణ్ణి పట్టుకునే నిమిత్తం ఇంకా అక్కడ వున్నాననీ వుంటాననీ చెప్పాడు. జిజీబాయి అతని ధైర్యానికి పట్టలేకుండా ఆశ్చర్యపోయి, ఆ వెంటనే ఆనందపడింది. "అదేమిటి నాయనా! ఆ కుర్రాడు వచ్చేశాడింటికి. అయినా, ఇంత చీకటిపడ్డదే నీకు భయం వెయ్యలేదురా, అబ్బాయ్?" అన్నది. అంతలోనే శివాజీ అందుకుని. "అమ్మా! నాకు తెలీకడుగుతాను, భయం అంటే ఎలా వుంటుందే, అదెక్కడుంటుందే, నాకు తెచ్చియ్యవూ?" అంటూ వాపోయాడు అమ్మని. ఆ ప్రశ్నకు జిజీబాయి తెల్లబోయి, తెప్పరిల్లుకుని సంభావణమార్చి "అది నీకనవసరంలే నాయనా" అన్నది.

భయం అంటేనే ఎరుగని శివాజీ అంతటి పరాక్రమవంతుడయ్యాడంటే, అందులో ఆశ్చర్యపడవలసిన అంశం అగుపించదేమో. ★



# సాక్షి



(42 - వ పేజీ తరువాయి)

వచ్చినప్పుడు మళ్ళీ వస్తే సిగపాయిదీసి తంతా నన్నాడు. మళ్ళీ ఏమనుకున్నాడో వెనక్కి పిలిచి అంతపనీ చేసి పొమ్మన్నాడు.

మునసబుగారు పెందలాడే భోంచేసి అరుగుమీద కూర్చున్నారు చుట్టముట్టించి ఆయనకి ప్రాణం కుతకుత ఉడికిపోతోంది. చూస్తూ చూస్తూ ఓ మనిషిని మరోడు ఖూనీ చేస్తువుంటే దిక్కుమాలినట్టు ఊరుకోడం ఆయనకీ నచ్చలేదు. తను వయసుమీద వున్నప్పుడు, అనేకసార్లు ఇలా కలగజేసుకోకుండా ఉండగలిగాడు. ఈనాడు వయసు తనమీది కెక్కి సత్తాతగ్గిన మీదట ఇలాటి బుద్ధి పుడుతోంది. గట్టిగా ఒటిచరిస్తే మూణ్నెల్లు మంచమెక్కాల్సినస్థితి తనది. మొన్న పాలేరుమీద నోరు చేసుకుంటేనే ఆయాసం వచ్చి ప్రాణం కడంటింది.

వొంట్లో ఓపికున్నవాడికి లేని బెడదలు నాకేల అనుకున్నాడు కాని సావిట్లో కెళ్ళబోతూ ఉండగా చుక్క తమ్ముడు ఎక్కణ్నించో తుర్రునవచ్చి బాబుగోరూ పకీరు గోడుబండిదిగి వచ్చేత్తిన్నాడండి మామావని సంపేత్తాడు అనేసి పరుగెత్తాడు, ఆయన జవాబుకూడా వినకుండా.

మునసబుగారు ఓనిమిషం మేనువాల్చారు గాని ఉండబట్టలేక చివాల్న లేచి చేతికర్ర పట్టుకుని ఇవతలికొచ్చారు. ఆడవాళ్లు లోపల పనుల్లో వున్నారు. గుమ్మంలో ఓనిమిషం నిలబడి మళ్లీ ఆలోచించారు. చివరకి అడుగు ముందర కేసి నడకసాగించారు మెల్లిగా. పకీరు - తలుపులు కొంపకెళ్ళాలంటే ముత్యాలమ్మ గుడిమీదుగా నేదారి. గుడికి ఎడమ వేపున పదిగజాల్లో అవతల వేపచెట్టుంది. అక్కడ లోగడ స్కూలుకని వేసిన పాక కూలిపోయి ఉంది. రెడ్డి రెండెడ్లబండి గుమ్మానికి అడ్డంగా ఉంది. మునసబుగారు నెమ్మదిగా వెళ్ళి చెట్టు మొదట్లో బండిచాటుచేసుకుని కుదురుగా నిలబడ్డారు.

* * *

తలుపులు నానా గోలాచేస్తున్నాడు. వెల్లకిలా పడుకుని వికిలిగా నానా కూతలూ కూస్తున్నాడు, పాడుతున్నాడు. నక్కపిల్లి కర్రముక్క - మూరెడున్నది, దిట్టమైన దోటీ పక్కన పెట్టుకున్నాడు. ఐగు నిమిషాల కోసారి రంగణ్ణితలుస్తున్నాడు. నాసావిరంగా మళ్లీ ఈపదం విన్నావా. నిమ్మసెట్టూకూ నిచ్చెనేస్సీ నిమ్మపళ్ళు కోయాబోతే నిమ్మముల్లే రొమ్మునంటేరా ఓరందక్కాడ తకడి దిందకాడ కోడి పందెక్కాడ—

హఠాత్తుగా తలుపులుపాట ఆపేశాడు.

మునసబుగారి గుండెఝల్లుమంది. కొంచెం ముందుకు వంగి తొంగిచూశారు.

అల్లంత దూరాన యములాడిలా పకీరు.

కాలిమీద కాలేసుకు విలాసంగా పడుకున్న తలుపులకు కాలిసందులోంచి పకీరు విగ్రహం కనబడింది. భయంకరంగా కనబడింది. వాడు దర్జాగా ఏనుగులా వొస్తున్నాడు. పొగరుగా వస్తాదులావస్తున్నాడు.

కోపంగా పాములా వస్తున్నాడు.

భయంకరంగా పకీరులా వస్తున్నాడు.

తలుపులు పాట ఆగిపోయింది. చూపు ఆగిపోయింది. కదలిక ఆగిపోయింది. ఓ క్షణం గుండె ఆగిపోయింది. హఠాత్తుగా ఒక్కసారిగా మళ్ళీ ఒళ్ళంతా వణకడం మొదలుపెట్టింది. రావిచెట్టుమీది కాకి కావుమనిఅరిచి టపటప రెక్కలు కొట్టుకుని వేపచెట్టు మీది కెగిరింది. ఎక్కడో కుక్క బొయ్యిమని మొరిగింది. రెండుమూడు ఇళ్ళ కిటికీ తలుపులు టపటపమన్నాయి. మునసబుగారు కదిలి అరవబోయారు. మాట రాలేదు. కాలు కదలలేదు. అలాగే స్తంభించిపోయారు.

తలుపులికి వొళ్ళంతా చెమట పోసేసి, బిగించుకుపోయిన శరీరం పట్టు సడలింది. పకీరు వచ్చేశాడన్న సంగతి పూర్తిగా బుర్రకెక్కింది. కెవ్వున అరవబోయాడు గాని అంతలో తిరిగి ఒళ్ళు బిగించుకుపోయింది. చేతులు నేలకివాలి పిడికిళ్లు బిగించుకుపోయాయి. గొంతు ఎవరో నొక్కుతున్నట్లయింది.

పకీరువచ్చి తలుపులు కెదురుగా కాళ్ళ దగ్గిర ఆగింది...క్షణంలో సగం పరకాయించి చూసి ముందుకు వంగింది. వెంద్రుకలతో దట్టంగా దిట్టంగా ఉన్న చెయ్యి ఒకటిముందుకు వచ్చి తలుపులు కమీజుకాలరు పట్టుకుంటోంది. తలుపు లేనా అంటోంది; గేదెకొమ్ముల్లాటి మీసాలూ, మీసాల్లాటి కనుబొమలూ ఉన్న మొహం. ఇవన్నీ చూస్తే సాక్ష్యం ఇవ్వాల్సివస్తుందనీ మళ్లీ ఈ రాక్షసుడు ఏం చేస్తాడోననీ దూరం ఆలోచించి చంద్రుడు మొహం మబ్బుచాటు చేసుకున్నాడు; సినిమా కెళ్ళిన కరణంగారిలా, తప్పుకున్న ముత్యాలులా, ఊరుకున్న ప్రెసిడెంటులా, మునసబులా.........

తలుపులు తొడుక్కున్న కరణంగారి కమీజుకాలర్ని పకీరు పిడికిలి బిగించి పట్టుకుంది. కొయ్యబారి నోరుతెరచి గుడ్లు తేలవేసి చూస్తున్న తలుపులు ఒక్కసారి బాబోయ్ అని పెద్దగావు కేక పెట్టాడు. అతనిలో అణిగిపోయిన మగసిరి తిరగబడి మేలుకుంది. భయం మొండితనమైపోయింది. ఒక్కసారి సర్వేంద్రియాలా చైతన్యం నిండిపోయి అన్నీ ఎగిరాయి. అతనిపక్కన నీరసంగా ఎండిన తోటకూర కాడలాపడున్న రెండుచేతులూ గుప్పిళ్ళలో గుమ్మతీసుకుని, ముందుకు వాలిన పకీరు మొహంలోకి కొట్టాయి. పకీరు పట్టవదిలి 'ఛా' అంటూ రెండు చేతులా మొహం మూసుకొని కళ్ళు వత్తుకోబోయాడు. విలాస ముద్రలో ఉన్న తలుపులు కాళ్లు రెండూ తెగిన స్ప్రింగులలా తన్నుకుని విడిపడ్డాయి; ముడుచుకుని ముంగకురికి పకీరును పొత్తికడుపుమీద తన్నాయి.

పకీరు వెనక్కి తూలి తమాయించుకుని పెద్దకేక పూరుమారు మోగే దాకా వేయబోయాడు గాని తలుపులు శరీరం మట్టగిడసలా తన్నుకుని బంతిలా పైకెగిరింది. తలుపులు తల పొట్టేలు మల్లె ముందుకు వంగింది. సన్నగా రివటలాఉండే తలుపులు తాలూకు శరీరం దాన్ని తీసుకువెళ్లి సరాసరి తూలి తమాయించుకోబోతున్న పకీరు పొట్టమీదకు గురిపెట్టికొట్టింది. బాణంలా వెళ్లి తగిలాడు తలుపులు.

పకీరు వెనక్కి పడుతూనే రెండుచేతులా తలుపులు జెబ్బలు పట్టుకున్నాడు. పడీపడగానే పక్కగా ఒరిగి, ఒక జెబ్బ వదిలి ఆచేతో తలుపులు రొమ్ముమీద గాఢంగా పొడిచాడు. తలుపులు కిక్కురుమన లేకపోయాడు గాని ఆ బాధలో అప్రయత్నంగా అతని అరచేతి కిందిభాగం పకీరు కింది పెదిమకు కొట్టుకుంది. పెదిమచితికి, హడావుడిగా పకీరు కుడిచేతిని ఒదార్పుకు పిలిచింది. ఎడమచెయ్యి అతని అనుమతి తీసుకోకుండానే, సగంలో వదిలేసిన కళ్ళకు సేవచేయబోయింది.

ఈవిధంగా ఊపిరితీసుకోడానికి సదుపాయం సంపాదించిన తలుపులు, ఆ పని పూర్తికాగానే ఇంకో దొర్లు దొర్లి లేచి ఉట్లసంబరాలకి అలవాటైన ఒడుపుతో ఎగిరి శక్తికొద్దీ రెండు మడమలతోటీ పకీరు

ఎదురురొమ్ముమీదకి దిగాడు. పకీరుకి ఆక్షణం ఈశ్వరుడు గురించిన జిజ్ఞాసకలిగితే, ఆయన రెండే చేతులిచ్చినందుకు తిట్టుకునేవాడు.

ఉన్న రెండిటికీ డ్యూటీ ఫిరాయించి తలుపులు కాళ్లు పట్టుకులాగ బోయేలోగా తలుపులు ఒకకాలుతో పకీరు గడ్డంమీద తన్ని తూలి ముందుకు పడిపోయాడు.

పకీరు తేలుకునేలోగా తలుపులుకు కర్ర అందితే బాగుణ్ణని చెట్టుచాటునించి చూస్తున్న మునసబుగారు చాలా ఆశపడ్డారుగాని ఆ సదుపాయాలు కనబడలేదు.

తలుపులు లేచికూర్చుని పక్కచూశాడు. పకీరు నోటివెంట ఎర్రటిరక్తం తెల్లటి వెన్నెలలో నల్లగా మిలమిల మెరుస్తూ చెంపమీదుగా నేలకి జారతోంది.

అమాంతం తలుపులికి బలం ధైర్యం తోలిసారి ఆవేశించాయి. కూర్చున్నపళంగానే ముందుకు వంగి రెండు పిడికిళ్లూ బిగించి పకీరు రెండు చెంపలమీదా ముక్కుమీదా మూడుగుద్దులు గుద్దాడు. పకీరు తిరగబడి లేవబోయేవరకూ తలుపులు పైకిలేచి నేలమీద అనివున్న పకీరు కుడిచేతిమీద బలంకొద్దీ అడుగేసితొక్కాడు.

బో బోయ్! అని పెద్ద కేక పెట్టాడు పకీరు. ఊరుమారుమోగిపోయింది. లోకంలో మంచివాళ్లూ, చెడ్డవాళ్లూ, బలవంతులూ బలహీనులూ. హింసాప్రియులూ అహింసాపరులూ ఎవరెవరన్న భేదాలకు అతీతమై అరిచినబాధఅది. చావుబతుకుల రెంటికీ ఐదు నిముషాలుగా సాగుతున్న ఆ భీకర సంగ్రామంలో చిన్న చిన్న మూల్గులు, నిట్టూర్పులూ తప్ప అంతవరకూ వినరాని తొలిపొలికేకఅది.

తలుపులు ఈసారి బలమంతా పూన్చిన పిడికిలితో నారి సారించినట్టు చెయ్యి వెనక్కిలాగి ఒక్క ఊపున పకీరు మెడ నరం మీద పోటుపొడిచాడు.

బోబోయ్ అని మరోపొలికేక వేసి గిలగిల తన్నుకున్నాడు పకీరు.

ఇంకో దెబ్బకి తలుపులు సన్నాహం చేస్తు ఉండగా పకీరు పిడికిటపొదిగి బిగించిన బొటనవేలుతో అతని డొక్కలో, గాఢంగా పొడిచాడు.

అర్భకుడు తలుపులు, జాతరలో కోడిపెట్టలా తన్నుకుని లేచి చెట్టుదగ్గరకి పరుగెత్తాడు. అక్కడ పక్కపిల్లి కర్ర ఉందన్న సంగతి అప్పుడు తట్టింది. కర్రతీసుకుని గిరుక్కున వెనక్కి తిరిగాడు తలుపులు.

ఆరడుగుల పకీరు గాయపడ్డ పులిలా తూచి.చూచి వొడుపుగాఅడుగులేస్తున్నాడు తన వేపు.

పకీరుచేతిలో నాలుగంగుళాల బాకుంది.

ఎత్తినకర్ర ఎత్తినట్టే ఉంచి అట్టే నిలబడిపోయాడు తలుపులు.

దగ్గరకు వచ్చాడు పకీరు.

"ద్దొంగ—"

పకీరూ అని హఠాత్తుగా పెద్ద గర్జన వినబడింది.

తుళ్లిపడి కేక వేపు చూడబోయి ఇటు తిరిగేలోగా పకీరు నెత్తిన తలుపులు కికి వంచనలేని దెబ్బకొట్టాడు. చేవగలకర్రతో.

బోబోయ్ అని ముత్యం మూడోసారి కేక వేసి కూలిపోయాడు పకీరు.

తలుపులు తిరిగా కుడివేపు చూశాడు. అందాకా చెట్టుచాటున ఉన్న మునసబుగారు ఇవతలికివచ్చి వెన్నెలలో నిల్చున్నారు. చేతికర్ర పట్టుకుని గంభీరంగా.

తలుపులు మళ్ళీ ఇటు తిరిగి కళ్లు మూసుకుని కసిదీరా పకీరును బడితెతో బాదుతున్నాడు.

ఇక చాలు తలుపులూ అన్నారు మునసబుగారు....

* * *

పంచాయితీ ఆఫీసు అరుగుదగ్గిర జనం చాలామంది చేరారు. ఆఫీసువారి మూడు హరికేను దీపాలూ ధర్మవిజయంలా ఉజ్వలంగా ప్రకాశిస్తున్నాయి. పకీరు కాళ్లూ చేతులూ కట్టేసి అరుగుమీద పడేశారు. ముత్యాలు అతని గాయాలు కడిగి మంచి నీళ్ళు పడుతున్నాడు. చుక్కపసుపుకుంకాలనీ, తలుపులు తాకతునూ మెచ్చుకుంటున్నారు ప్రేక్షకులు. చుక్క ఇర్నాడు తప్పకుండా అమ్మవారికి ఉపారా లెడతానంటోంది. తలుపులు నీరసంగా గోడకి జారబడి పడుకున్నాడు. మళ్ళీ జ్వరం వచ్చిందీ ఒంటిన తెలివిలేదు.

ఇంకోఘడియకి కొంత అలికిడి వినబడింది. సందడి తగ్గి కొత్త గొంతుక వినబడడంతో మెల్లిగా కళ్ళు తెరిచాడు తలుపులు:

ఎదురుగా పోలీసులు. జనంఅంతా అమ్మయ్యఅంటున్నారు.

పకీర్ని మీరెలా వదిలేశారండీ అంటున్నారు. మునసబుగారు ఆశ్చర్యంగా.

'తలుపుల్ని పట్టుకోడానికి. చింతాలకూనీకేసులో వీడోపెద్ద హీరో. వాడూ వీడూ కలిసే చంపుంటారు.వీడెలాగో పారిపోయి పైపెచ్చు కోర్టుకొచ్చి ప్రాసిక్యూషన్‌తరఫున పకీరుమీద సాక్ష్యం ఇచ్చి వచ్చాడు. వీడి ప్రతిభ ఈసంగతి మధ్యాన్నమే తెలిసింది. పకీరుముందరే చెబితే మేంనమ్మలేదు.అందుకని మేమొచ్చేలోగా పకీరు తొందరపడి మాతో చెప్పకుండావచ్చేశాడుఅన్నారుఇన్‌స్పెక్టరుగారు.

కాని వీడెంతనాటకం ఆడాడూ. మొగుణ్ణిగొట్టి మొగసాలెక్కినట్టు-వల్లండి దొంగని దొంగే బట్టుకోవాలి. అన్నారు మునసబుగారు.

బావుంది ఇపుడు మీరంతాకలిసి వాళ్లని పట్టిచ్చారు మరి మీరంతా దొంగలేనా?

ఏమో దొరికాక ఒకొక్కడు ఒకొక్క రకం దొంగ...దొరికేదాకా ఒకొక్కడూ ఒకొక్కదొర అన్నారు. మునసబుగారు ★

## ★ వంచన ★

(27-వ పేజీ తరువాయి)

ఆ తరువాత ఒకటి రెండుసార్లు కమల దూరంగా బజారులో కనిపించింది. నేను మాట్లాడలేదు. క్షమాపణ చెప్పకోవడం కూడా సిగ్గనిపించింది నాకు.

ఈ సంగతి ఇన్నాళ్లు తెలుసుకోలేకపోయినందుకు నామీదకన్న, తెలియచెప్పనందుకు కమలమీద నాకు చెప్పరానికోపం వచ్చింది. ఆమెను ఈనాటికీ నేను క్షమించలేదు.

మగవాడిని కేవలం వినోదంకోసం కాకపోతే అంత దగ్గరకు ఎందుకు రానివ్వాలి? ఎందుకు అంతగా కవ్వించాలి? తీరా దగ్గరకు వచ్చాక, కాలు వడ్డంపెట్టి, పశవేసి, ఏమి ఎరగనట్లు ఈ అటించడం ఏమిటి?

ఇదంతా ఆడవాళ్ళు తమ అతిశయాన్ని చూపించటానికి ఆడే నాటకం. దీనిలో మగవాడు ఒక చైనీస్ డాల్ అంతే!

అయితే అమ్మ—?

ఇవ్వాల్టికీ నాన్నను తలుచుకొని, ఆ రోజులను తలుచుకొని కుమిలిపోవడం ఏమిటి? మరి, అమ్మ నామీద చూపే ప్రేమానురాగాలు? ఆవిడ నాకోసం చేసిన, చేస్తున్న త్యాగం?

ఇవన్నీ స్వార్థరహితంగానే స్త్రీలు చేస్తారంటే నేను నమ్మను. చివరకు అమ్మ అయినా సరే! అందుకే అమ్మ ప్రేమలో కూడా ఇవ్వాళ నేను స్వార్థాన్ని కొలుస్తున్నాను.

పార్వతీ, కమలా స్త్రీ జాతికి మేలు బంతులు. వాళ్ళు నన్ను దగాచేశారు. అందరు ఆడవాళ్ళూ ఈవిషయంలో ఒకటే!

అందుకే-ఆడవాళ్ళు మగవాళ్ళని ఆటవస్తువులుగా చూస్తారని, ఆడవాళ్ళకు స్వార్థం తప్ప మరేమీ అక్కరలేదని, వాళ్ళంటే నాకు అసహ్యం అని నమ్మాలని నేను దృఢంగా 'నిశ్చయించుకొన్నాను. అందుకే ప్రయత్నం చేస్తున్నాను—నన్ను నేను వంచనచేసుకొని అయినా సరే! ★

మీ చర్మమునకు

అధిక గ్లిసరిన్
మనుపుదనము నిచ్చును

లనొలిన్
రక్షణ నొసగును

ఆక్టమర్
క్రిమి నివారిణి






ఉత్సాహప్రదమగు క్రొంగ్రొత్త

OK ఓ.కె. చందన సబ్బు

మీ కలలు నిజమాయి—మనమోహక సౌందర్య లావణ్యాలు, వరంపరాగత శోభతో— ఉత్సాహప్రదమగు క్రొంగ్రొత్త ఓ. కే. చందన సబ్బు నిర్మాణంతో మీ హస్తగతమైనవి. అందులో పరిశుద్ధ చందనతైలము అధిక ప్రమాణాలలో కలదు. దానితోబాటు లనొలిన్, ఆక్టమర్ మరియు అధిక ప్రమాణపు గ్లిసరినుల వాడకంలో గల అత్యాధునిక సూత్రాల ప్రభావము సైతం చేరియున్నది. ఈ సబ్బు భారతదేశంలో తయారైన టాయిలెట్ సబ్బు లన్నింటిలో అత్యుత్తమమైనదని నిష్కర్షగా చెప్పగలుగుతున్నాం. ఎందువల్లనంటే—

- లనొలిన్ ప్రభావంవల్ల—అది ఎండవేడిమి, గాలి, ఉష్ణము మరియు హవామాన తీవ్రతలనుండి మీ నవ కోమల చర్మమునకు ప్రాణపదకమువంటి తేమను రక్షించును.
- ఆక్టమర్ ప్రభావంవల్ల—మీ చర్మమునకు అంటురోగములు తగులనివ్వకుండా ఆరోగ్యము నొసగును.
- అధికప్రమాణపు గ్లిసరిన్ ఉన్నందువల్ల-అతి మృదువైన చర్మమునకు నయితం అది ఎంతో హాయినిచ్చును.

అందుతోబాటు పరిశుద్ధ చందనపు కోమల సౌరభం!

**ఉచితము**

ఓ. కే. పరిచయంకొరకు
బహుమతి ప్రదానం
(3 నెలల వరకు మాత్రం)
ఓ. కే. చందన సబ్బు 3 బిళ్లలు కొనండి. అద్వితీయ దంతపు మెరుగు సబ్బుపెట్టెను—కేవలం ఉచితంగా పొందండి.

**ది ఈస్ట్ ఏష్యాటిక్ కంపెని (ఇండియా) ప్రైవేట్ లిమిటెడ్, మదరాసు-1**

EP

# ఇరులవంటి కురులే సిరులైన సింగారం

## చానలకు చక్కదనమిచ్చే వేనలి...

('కురూపికి అయినా కురులే అందం' అన్నారు పెద్దలు.

శ్రీకృష్ణుడు ఒకానొక అత్యవసర సన్నివేశంలో సత్యభామను ప్రత్యేకంగా 'బిలలితేంద్ర నీలశకలోపమకైశిక' అనీ, 'అలినీలాలక' అనీ, 'అరాళ కుంతలా' అనీ ప్రియంగా పిలచాడు. సరస్వతిని స్తుతిస్తూ పోతన మహాకవి ఆమె 'చంచరీకచయ సుందర వేణి' అని పేర్కొన్నాడు. నేటిభావ కవి ఒకరు ప్రేయసి మల్లెపూలజడ జలపాతంలా ఉన్నదని అభివర్ణించారు.

వేనవేలుగా వేనలిపై వర్ణనలు కావ్యలోకంలో ఉన్నాయి. మచ్చుతునకలు కొన్నిమాత్రం రచయిత్రి ప్రస్తావిస్తారు.)

### ఎం. దమయంతి

వేనలిపై వ్యాసమేమిటని అనుకుంటారేమో—వేనలి అంత సామాన్యమైనది కాదు. దుశ్శాసనునిచే లాగబడిన ద్రౌపదీ వేణియే కదా కౌరవాటవికి కొలుచిచ్చయినది! ఆడవారి జడలు మాత్రమే కాదు ఆ జడలోని పూవులుకూడ సామాన్యమైనవి కావు. శ్రీకృష్ణునంతటివాడు సత్యభామ కబరీభరానికి పుష్పాలు సమర్పించే నిమిత్తం సమరము చేశాడు.

చతుష్షష్టి కళల్లో 'శేఖరకాపీడన యోజనం'—అంటే అనేక రూపములుగా శిఖల ముడుచుట, వాని యందు మాలికలు గూర్చుట అనేది—ఒక కళగా పేర్కొనబడింది.

కావ్యాలంకారవేత్తలు 'వేణి'ని సర్ప, అసి, భృంగావళి, వేణీదండము మొదలగు వానితో పోల్చవచ్చునన్నారు. అట్లే కేశములకు దీర్ఘత్వము, కౌటిల్యము, మృదుత్వము, సాంద్రత్వము, నీలత్వమును వర్ణ్యములు అన్నారు.

ఆడవారి జడలను ఎందరెందరో కవులు వర్ణించారు. అందులో కొన్ని ఉదాహరిస్తాను.

**తుమ్మెదలతో తుల**

లంకలో సీత ధైర్యము చెదరి వణకుచు వణకుచు నేలమీదపడి పోయిందట. ఆ వ్యాడట్లు కంపించుచున్న సీతా కాంత యొక్క దీర్ఘమును, విపులమునైన వేణి నేలమీద పొరలుచు కృష్ణసర్పము వలె నున్నదట.

శ్రీ బమ్మెరపోతన గారు 'రుక్మిణీ కళ్యాణం'లో 'జితమత్త మధుకరశ్రేణీ వేణి' అన్నారు. ఈ వేణిని మదించిన తుమ్మెదల శ్రేణితో పోల్చారు.

శ్రీనాథుడు శృంగార నైషధములో 'యువ మనోమృగ రాజిఁ దవిలింపఁ దీర్చిన మదన వాగురలింగు వదనకురులు' అన్నారు. యువకుల మనస్సులను పట్టుకొనటానికి పన్నిన వలలట కురులు.

శ్రీ కాకమాని మూర్తికవి ప్రణీతమైన 'రాజవాహన విజయము'లో స్త్రీల వెండ్రుకలు పాముతో పోల్చబడినవి. స్త్రీల జలకేళి సందర్భంలో.

'వాలిడెందు నెరుల మించు
పాదటంచు లాగ నొకతె'

ఒక స్త్రీ నీటిలో మునిగింది. ఆమె వెండ్రుకలు నీటిపై తేలాయి. వాటిని చూసి పాము అనుకొని మరొక స్త్రీ ఆ వెండ్రుకలను పట్టుకొని లాగింది.

**నెచ్చెలిజడ నిచ్చెన!**

శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు 'వేయిపడగలు' అనే నవలలో ఈ జడను ఒక నిచ్చెనతో పోల్చారు.

'ఆ జడ మెడనుండి నేలవఱకు వ్యాపించి నేలపై గొంతభాగము వ్రేలాడుచుండెను. అదియొక నిచ్చెన. తానా నిచ్చెనపైనుండి యొక్కి ఆమె మనఃపీఠ మలంకరింపవలయు ననుకొనెను.'

**అందానికి అనుబంధం**

కొందఱు కవులు అతివల జడలను పరిహసించారు. కొన్నిమాత్రం పేర్కొంటాను.

శ్రీ కవికొండల వేంకటరావు గారు 'పొట్టి రవికలూ—వాలు జడలూ' అనే కథానికలో వాలుజడలను గురించి ప్రస్తావించారు.

'ఆ అమ్మాయి లిద్దరి జడలూ వాలుజడలే. వల్లని ఒత్తుకురులు పెనేసి చివర రిబ్బను ముక్కలు ముడెట్టి సాగలాగినవే. వెనక్కు వెన్నుపూసనే పడేస్తే పిలుగుల కందం, ముందుకు బుజమ్మీదనుంచి తీసుకుంటే ఉరితాళ్ళ కందం. జడలంటే అలా ఉండాలి.'

ఈ జడ స్త్రీలకు వెనుకభాగంలో ఎందుకు సృష్టింపబడిందీ? అని కొందఱు తర్జన భర్జనకూడ చేసారు.

పురుషాయిత మొనర్చు పూబోడి కటిమీద
నాట్యంబుసల్పు పుణ్యంబు కొఱకొ?
ఘన నితంబ స్థలంబను పెన్నిధానంబు
బహుభద్రముగను గాపాడు కొఱకొ?
తానాశ్రయించు కాంతకు వెన్కభాగమ్ము
నను గూడ సౌందర్యమనుచు కొఱకొ?
పదిమంది దృష్టులుపడిన 'కంటక' మంచు
నూహించి కనుపడకుండు కొఱకొ?
వేణికాంతల వెన్నంటి వ్రేలు చుండె
లేకయుండిన నిధువనలీల కుపచ
రించు నంగమ్ము లెదుటనే పంచు నింద
దాని కట్లుండ నేయు
పద్రవము వచ్చె?

(నానారాజ సందర్శనమునుండి)

శ్రీ మునిమాణిక్యం నరసింహా రావు గారు జడను అట్లగరిటెతో పోల్చారు.

శ్రీ తిరుపతి వేంకటేశ్వరకవులు శ్రవణానందములో లీల గిలెడజోట్టి చాల్లెమ్మవెట్టి

(53 పేజీ చూడండి)







# అత్తలూ_ కోడళ్లూ_

“గృహమే కదా స్వర్గసీమ” అని హాయిగా పాడుకోవటానికి తోడ్పడే ముఖ్యాంశాల్లో ఒకటి—అత్తా కోడళ్లు అన్యోన్యంగా, ఆప్యాయంగా ఉండటం. అత్తా కోడళ్లు అస్తమానం కీచులాడుకునే ఇంట్లో మగవాడు క్షణంసేపైనా నిలవటం కష్టమైపోతుంది. కీచులాటలకు కారణం అత్తగారు కావచ్చు, కోడలు కావచ్చు, లేక ఇద్దరూ కావచ్చు. కనిపెంచి పెద్దచేసిన కొడుకు తన చేతుల్లోంచి జారిపోయి పరాయిచేతుల్లోకి పోతున్నాడేమోనని, ఇన్నాళ్ళు తను పెత్తనం చెలాయించిన ఇంట్లోకి పరాయమ్మాయి అడుగుపెట్టి నెమ్మదిగా అధికారం స్వాధీనం చేసుకుంటోందనీ బాధపడి అత్త, తన భర్త తనమాట వినాలి గాని ఆయన్ని శాసించేందుకు అత్త ఎవరని కోడలూ తగూలాడతారని అంటారు. తనూ ఒకప్పుడు కోడలేనని అత్త, తనూ ఒకనాటికి అత్త కాబోతున్నానని కోడలు గ్రహిస్తే కీచులాటలకు ఆస్కారం ఉండదు.

ఈదిగువ కోడళ్లకు కొన్ని ప్రశ్నలు, అత్తలకు కొన్ని ప్రశ్నలు ఇవ్వబడ్డాయి. ఆయా సందర్భాల్లో మీ రెలా ప్రవర్తిస్తారో నిర్మొహమాటంగా మీకు మీరే సమాధానాలిచ్చుకుని, వాటినిబట్టి మార్కులు వేసుకోండి. మార్కులనుబట్టి మీ రెలాంటి అత్తలో, కోడళ్లో మీకు మీరే నిర్ణయించుకోండి. ఈ శీర్షిక కొంచెం కాలక్షేపానికీ, చాలవరకు మనస్తత్వ నిర్ణయానికీ కూడా తోడ్పడుతుంది. ఒకసూచన: ఒకరిస్వభావం ఒకరికి తెలుసుగదా అని అత్తగారి ప్రశ్నలకు కోడలూ, కోడలు ప్రశ్నలకు అత్తగారూ తమంతటతాము సమాధానాలు చెయ్యకూడదు. ఎవరిప్రశ్నలకు వారే సమాధానాలు వేసుకుని ఊరుకోవాలి.

## కోడళ్ళు



1. మీ పిల్లవాడు మీరు చెప్పినమాట వినకుండా అల్లరిచేస్తున్నాడు. మీకు కోపం వచ్చి నాలుగుఅంటించి “పోయి చదువుకో” అని ఆజ్ఞాపిస్తారు. మీఅత్తగారు వాణ్ణివెనకేసుకొచ్చి “ఇప్పుడేం చదువు? పోయిఆడుకో” అంటారు. మీరు:

(అ) అత్తగార్ని “మీసంగతి మీరు చూసుకుందురూ?” అని, పిల్లణ్ణి “నేను చెప్పినట్లు చేస్తావా? లేదా?” అని కసురుతారా? (ఇ) పిల్లడు ఉండగా అత్తగారితో వాదించటం మంచిది కాదని వాడు లేనప్పుడు “అది కాదత్తయ్యా! మీరలా గారాబంచేస్తే వాడు చెడిపోడూ?” అంటారా? (ఉ) “ఏదో పెద్దావిడ” అని ఊరుకుంటారా? (ఎ) మీరుచెప్పినట్టు చెయ్యటమే పిల్లడికిమంచిదని మర్యాదగాఆవిడతో చెబుతూనే, పిల్లడు మీమాట వినేట్టుచేసుకుంటారా?

2. అత్తగారు “గుళ్ళోకెడదాం, రావే” అనో, హరికథకో వెడదాం రావే అనో ఆప్యాయంగా పిలుస్తారు. పక్కింటావిడ మధ్యాహ్నం ఆటకి సినిమాకి వెడదామని బలవంతం చేస్తుంది. మీరు:

(అ) అత్తగారిమాట కాదని సినిమాకే వెడతారా? (ఇ) ఆవిడతో గుడికివెళ్ళి, గబగబావచ్చి సినిమాకి వెడతారా? (ఉ) సినిమా మానేసి అత్తగారితోనే వెడతారా? (ఎ) “పక్కింటావిడ పిలిస్తే వెళ్ళకపోతే బావుండదు” అని చెప్పి సినిమాకి వెడతారా?

(3) అత్తగారు మీవంట ఏమీ బాగు లేదని అభిప్రాయపడుతుంది. మీరు:

(అ) “ఏదో నా చేతైనట్టు నే చేస్తున్నాను. పోనీ, మీరు చెయ్యరాదూ?” అంటారా? (ఇ) మీవంటనిమీరు గట్టిగా సమర్థించుకుంటారా? (ఉ) మీవారు చప్పిడి

వంటలే ఆరోగ్యం అన్నారని చెబుతారా? (ఎ) "పోనీ నేర్చుకుంటాను. చెప్పండి" అని సలహాలు అడుగుతారా?

4. మీరు తెమ్మని చెప్పిన ముఖ్యమైన దేదో తేవటం మర్చిపోయినందుకు, మీ భర్తని మీరు గట్టిగా కూకలేస్తూంటారు. అత్తగారు సంగతేమిటో తెలుసుకోకుండా కలగజేసుకుని కొడుకుని వెనకేసుకొస్తుంది. మీరు:

(అ) కోపంగా అక్కణ్ణుంచి నిష్క్రమిస్తారా? (ఇ) "అది కాదత్తయ్యా. సంగతిది" అని, విడమరిచి చెప్పి అక్కడితో విషయం వదిలేస్తారా? (ఉ) "నా విషయాల్లో కలగజేసుకోకండి మీరు" అని గట్టిగా చెబుతారా? (ఎ) "ఆ, ఏంలేదు" అని మాటమారుస్తారా?

5. మీవారు తల్లి ఎదుట మీ వంటనీ, ఆవిడ వంటని పోల్చి, మీ వంట అమోఘమైనది కాదనే అభిప్రాయం వెల్లడిస్తారు. అత్తగారు ఇది విని లోపల మురిసిపోతున్నా పైకి ఏమీ అనరు.



(అ) మీరుకూడా నిజంగానే ఆవిణ్ణి మెచ్చుకుంటారా? (ఇ) విని ఊరుకుంటారా? (ఉ) లోపల మండిపోయినా, అప్పటికి ఊరుకుని ఆ తరవాత చాటుగా భగ్గుమంటారా? (ఎ) ఆవిడ వంటని, ఈయన అభిరుచుల్నీ విమర్శిస్తారా?

6 మీకు వద్దన్నవీ అత్తగారు చెయ్యామన్నవీ, మీవారు చేసూ ఉంటారు. దాంతో మీకూ మీవారికీ మాటా మాటా వచ్చి మీరు:



(అ) సరాసరి అత్తగార్ని నిందిస్తారా? (ఇ) ఆవిడే నూరిపోస్తోందని సూచనగా అంటిస్తారా? (ఉ) "ఆయన కోపం అదే తగ్గుతుంది, తరవాత మనసు మార్చుకుంటారు" అని మాట్లాడక ఊరుకుంటారా? (ఎ) అత్తగార్ని మంచిచేసుకోటానికి ప్రయత్నిస్తారా?

7. అయిన దానికీ, కాని దానికి అత్తగారు ఏవో సలహాలు మీమీద వెదజల్లుతూ ఉంటారు. మీరు:

(అ) ఆవిడతో వాదన వేసుకోకుండా మీకు తోచినట్లు మీరు చేస్తారా? (ఇ) "కావలిస్తే మీ సలహా అడుగుతానెండి" అంటారా? (ఉ) ఆమె సలహాల్లో బాగా ఉన్నాయనిపించిన వాటిని స్వీకరిస్తారా? (ఎ) "నేను బాగా ఆలోచించే చేస్తున్నాను. మీకు తెలియదులెండి" అని చెప్పేసి మీకుతోచినట్లే చేస్తారా?

8. అత్తగారికి మిగతా కొడుకుల ఇళ్లల్లో సరిపడక మీ యింట్లోనే ఉండాలని తీర్మానించుకుంటారు. మీకు ఆవిడ ఆర్భాటం, జబర్దస్తీ చూస్తే గిట్టదు. మీరు:

(అ) కొన్నాళ్ళపాటు చూసి, పడక పోతే అప్పుడు చూసుకుందాం అని ఒప్పుకుంటారా? (ఇ) "ఏమైనాసరే, మనదగ్గర వద్దు" అని మీ వారితో స్పష్టంగా చెబుతారా? (ఉ) మారుమాట్లాడకుండా సరే అంటారా? (ఎ) అందరుకొడుకుల ఇళ్లల్లోనూ కొంతకొంత కాలంపాటు ఉండే ఏర్పాటు చేయిస్తానని మీవారిదగ్గర మాట తీసుకుని, అత్తగారిని ఉండమంటారా?

9. మీ నాన్నగారూ, మామగారూ కూడా మీ దంపతులిద్దర్నీ దీపావళికి రమ్మని రాశారు. మీరు:

(అ) దీపావళికి ఒకచోటికి వెడుతూ, సంక్రాంతికి ఇంకో చోటికి వస్తామని రాయిస్తారా? (ఇ) మీ తల్లిదండ్రుల్నీ, మీ వారి తల్లిదండ్రుల్నీ కూడా మీ దగ్గిరికే రమ్మని రాయిస్తారా? (ఉ) మీ పుట్టింటికే వెడదామని పట్టుపడతారా? (ఎ) అత్తవారింటికే వెడతారా?.

10. మీ అత్తగారు వయసుకి పెద్దదైనా, ఇంకా వంటచేసే ఓపిక ఉంది. మీరు:

(అ) ఒకపూట ఆవిడా, ఒకపూట మీరూ వంటచేసే పద్ధతి పెట్టుకుంటారా? (ఇ) ఆవిణ్ణి 'కృష్ణా రామా' అనుకుంటూ కూర్చోమని రెండుపూటలా మీరే చేస్తారా? (ఉ) రెండుపూటలా ఆవిడనే చెయ్యమంటారా? (ఎ) వంతు ప్రకారం ఒకపూట ఆవిడ చేస్తున్నా, మీరు అవీ ఇవీ అందిస్తూ చేదోడుగా ఉంటారా?

## అత్తలు

1 మీ మనవళ్లో, లేక మనమరాళ్లో తెగ అల్లరి చేస్తారని మీరు చికాకు పడుతూంటారు. మీ కోడలు వాళ్ళ విషయమే పట్టించుకోదు. మీరు:



(అ) సరాసరి కోడల్ని నిందిస్తారా? (ఇ) కోడల్ని దగ్గర కూర్చోబెట్టుకుని పిల్లల్ని ఎలా పెంచాలో నెమ్మదిగా బోధిస్తారా? (ఉ) మీ పిల్లల్ని మీరు ఎలా పెంచారో, ఎలా దిద్దారో సూచనగా చెబుతారా? (ఎ) నాకెందుకులే అని ఊరుకుంటారా?

2. మీకోడలు వంటలో ప్రవీణురాలు కాదని మీ నమ్మకం. మీరు:

(అ) ఆ సంగతి నిష్కర్షగా చెప్పేస్తారా (ఇ) మాట్లాడక ఊరుకుంటారా? (ఉ) వంట బాగానే ఉందని చెప్పి సర్దుకుపోతారా? (ఎ) "అత్తయ్యా, ఈకూర ఎలా చెయ్యాలి" అని కోడలు అడిగితే మాత్రమే సలహా లిస్తారా?

3. సాధారణంగా మీరు:

(అ) ఇంటిపనుల్లో కోడలికి సహాయపడుతూ ఉంటారా? (ఇ) మీ పూచీ ఏమీ లేనట్లు, ఇవతల పూచీ పుల్ల అవతల పెట్టకుండా ఊరుకుంటారా? (ఉ) కోడలికి సహాయం చెయ్యటం అవసరమని మీకు తోచినప్పుడల్లా చేస్తారా? (ఎ) ఏదో మీకు చెయ్యాలని తోచినప్పుడు చేసి, లేనప్పుడు మానేస్తారా?

4. మీ అబ్బాయికీ, కోడలికి పడటంలేదని మీరు గ్రహిస్తారు మీ అబ్బాయి "ఏం చెయ్యమంటావమ్మా" అని అంటాడు. మీరు:

(అ) కోడలికి లాలనగా హితవు చెబుతారా? (ఇ) కొన్నాళ్ళపాటు పుట్టింటికి పంపించెయ్యి అంటారా? (ఉ) "మీరు మీరూ సర్దుకుపోవాలి గాని మధ్య నాకెందుకూ?" అని ఊరుకుంటారా? (ఎ) ఇద్దర్నీ కూర్చోబెట్టి ఇద్దర్నీ మందలించి బుద్ధిచెబుతారా?

5. మీకూ, మీ అబ్బాయికి తెలియకుండా మీకోడలు బట్టల కొట్లో అరువు

# ★ అత్తలూ-కోడళ్లూ ★

పట్టి పెద్దచీర ఎదో కొనుక్కుందని పొరు గింటావిడ మీకు చేరేస్తుంది. మీరు:



(అ) వెంటనే కోడల్ని పిలిచి కోప్పడ తారా? (ఇ) నిజమో కాదో తేల్చుకుని మరీ మందలిస్తారా? (ఉ) మీ అబ్బాయితో చాటుగా చెప్పేస్తారా? (ఎ) ఏమీ మాట్లాడ కుండా ఊరుకుంటారా?

6. మీ అబ్బాయి తెచ్చే జీతంరాళ్లు నెల మధ్యకే హరించుకు పోవటంవల్ల అప్పులతో అవస్థపడుతూ ఉంటారు. మీ కోడలు వరస చూస్తే ఆవిడే దీనికి ముఖ్యకారణమని మీకు తోస్తుంది. వెంటనే మీరు:

(అ) కొడుకు ఎదుట పెట్టుకుని కోడలే ఈ అవస్థలకి కారణమని దులిపేస్తారా? (ఇ) కోడలు అడిగితేనే ఖర్చులు తగ్గించి పొదుపు చేసే పద్ధతులు బోధిస్తారా? (ఉ) కొడుకుతో "డబ్బు నీదగ్గరే ఉంచుకుని, ఇల్లు నువ్వే నడుపు" అని చెబుతారా? (ఎ) కోడలికి పొదుపుచేసే పద్ధతి లాలనగా నేర్పుతారా?

7. మీకు మడీ, ఆచారం, పూజా పునస్కారాలు ఉన్నాయి. కోడలికి ఇవేవీ లేవు. మీరు:

(అ) మీ మటుకు మీరు మడీ ఆచారం పాటిస్తూ వేరేవంట పెట్టుకుంటారా? (ఇ) కోడలు ఎడ్డెమనిషి, శుచి శుభ్రత లేదని సాధిస్తూ ఉంటారా? (ఉ) కోడలికి నెమ్మదిగా నచ్చచెప్పి మీ పద్ధతులు అలవాటు చెయ్యటానికి ప్రయత్నిస్తారా (ఎ) ఈ కాలపువాళ్ళు ఇంతేనని ఊరుకుంటారా?

8. మీ కోడలు ఎప్పుడూ సినిమాలకెడుతూ, మహిళాసంఘాల కార్యక్రమాల్లో పాల్గొంటూ, పొరుగిళ్లకు పెత్తనాలు చేస్తూ మొగుడిసంగతీ, పిల్లలసంగతీ పట్టించుకోవటం లేదని మీ అభిప్రాయం. మీరు:

(అ) పద్ధతులు మార్చుకోవాలని, లేకపోతే పిల్లలు చెడిపోతారని నచ్చచెప్పటానికి ప్రయత్నిస్తారా? (ఇ) మీ అబ్బాయితో చెప్పి మందలించమంటారా? (ఉ) నీ తిరుగుళ్ళు నాకేమీ నచ్చలేదని నిష్కర్షగా చెప్పేస్తారా? (ఎ) మాట్లాడక ఊరుకుంటారా?



(9) మీ అమ్మాయికీ, మీ కోడలికీ తరుచు పచ్చగడ్డి వేస్తే భగ్గుమంటుంది. కోడలి నోటి దురుసుతనమే కారణమని మీ అభిప్రాయం. మీరు:

(అ) మీ అమ్మాయినే వెనకేసుకొస్తారా? (ఇ) అమ్మాయినే కేకలేసి కోడలినే సముదాయిస్తారా? (ఉ) పట్టించుకోనట్లు ఊరుకుంటారా? (ఎ) ఇద్దరినీ కేకలేసి సర్ది చెబుతారా?

(10) మీ అబ్బాయి ఎప్పుడూ కోడలి పక్షమేనని, మీ యోగక్షేమాలేమీ చూడడని మీకు కష్టంగా ఉంటుంది మీరు:

(అ) ఈమాట తరుచు కోడలి మొహానే అనేస్తారా? (ఇ) ఇరుగుపొరుగుల వాళ్లతో కష్టసుఖాలు చెప్పుకుంటున్నప్పుడు అంటూ ఉంటారా? (ఉ) కొడుకుతో చాటున చెప్పుకుంటారా? (ఎ) కడుపులో పెట్టుకుని ఊరుకుంటారా? ★

## మీ స్వభావం

మీరు ఎటువంటి కోడలో, ఎటువంటి అత్తగారో ఈ క్రిందిమార్కులవల్ల తెలుసుకోవచ్చు. 10 ప్రశ్నలకూ 10 సమాధానాలు ఇచ్చుకుని ఆయా సమాధానాలకు ఇక్కడఉన్న మార్కులను చూసి గుర్తుపెట్టుకుని, వచ్చిన మార్కులన్నీ కూడండి. 30—40 మధ్య మార్కులువస్తే మీరు ఆదర్శప్రాయులైన కోడలో, అత్తగారో అవుతారు. 20 లోపు మార్కులువస్తే స్వభావం కొంచెం మార్చుకోటానికి ప్రయత్నించాలన్నమాట. 20—30 మధ్య మార్కులువస్తే ఒక మోస్తరు.

### కోడళ్లకు

| ప్రశ్న | అ. | ఇ. | ఉ. | ఎ. | స్కోరు |
|---|---|---|---|---|---|
| 1 | 1 | 3 | 2 | 4 | |
| 2 | 1 | 3 | 4 | 2 | |
| 3 | 1 | 2 | 3 | 4 | |
| 4 | 2 | 4 | 1 | 3 | |
| 5 | 4 | 3 | 2 | 1 | |
| 6 | 1 | 2 | 3 | 4 | |
| 7 | 3 | 1 | 4 | 2 | |
| 8 | 4 | 1 | 3 | 2 | |
| 9 | 3 | 2 | 1 | 4 | |
| 10 | 2 | 4 | 1 | 3 | |

### అత్తగార్లకు

| ప్రశ్న | అ. | ఇ. | ఉ. | ఎ. | స్కోరు |
|---|---|---|---|---|---|
| 1 | 1 | 4 | 3 | 2 | |
| 2 | 1 | 2 | 4 | 3 | |
| 3 | 4 | 1 | 3 | 2 | |
| 4 | 3 | 1 | 2 | 4 | |
| 5 | 1 | 3 | 2 | 4 | |
| 6 | 1 | 3 | 2 | 4 | |
| 7 | 2 | 1 | 4 | 3 | |
| 8 | 4 | 3 | 1 | 2 | |
| 9 | 1 | 4 | 2 | 3 | |
| 10 | 1 | 2 | 3 | 4 | |

## చర్చావేదిక:

# యత్రాకృతిః తత్రగుణాః

('యత్రాకృతిః తత్రగుణాః', అనేసూక్తి నేటికాలానికి వర్తించదంటూ అనేకులు 'చర్చావేదిక'కు వ్రాశారు. చాలామంది అసలు ఆ ప్రవచనంలో నిజం లేదన్నారు. మచ్చుతునకగా ఒక అభిప్రాయం ఇక్కడ ప్రకటిస్తున్నాం.)

"యత్రాకృతిః తత్ర గుణాః" అన్న వాక్యం బహు కొద్దిమంది యందు మాత్రమే సార్థకమౌతుంది. ఆకారమునుబట్టి గుణదోషాలను అంచనా వేసుకోవటం ఈ రోజులలో గుసాధ్యమే కాకుండా గుసాహసమన్పిసుంది. పురాణకాలంలో సావిత్రి సీత కని, అనసూయ దేహసౌందర్యానికి, ఆత్మ సౌందర్యానికి వన్నె కెక్కినవారే. కాని కేవలం బాహ్యసౌందర్యం మూలంగానే వారికి సకల సద్గుణాలూ ప్రాప్తించాయని అనడం ఏమంత సమంజసంగా లేదు. ప్రాచీన కాలంలో కూడా గుర్మార్గులైయుండి అతిలోక సుందరులైన స్త్రీ పురుషులనేకులున్నారని ఇతిహాసముల వల్ల తెలుస్తూన్నది. ఈర్ష్యాద్వేషములకు ప్రతిమూర్తి అయిన దుర్యోధనుడు రూపవంతుడు కాడా? గర్వానికీ, అహంకారానికీ పేరు పడ్డ అందాలరాసులైన అప్సరస లెంతమంది లేరు?

పురాణకాలంమాటలా ఉన్నా ఈ కాలంలో మటుకు సుందరాకృతి గలిగి గుణహీనులైనవారు, వికృతాకారులై గుణ సంపన్నులైనవారూ మన నిత్యజీవితంలో చాలామంది తటసపడుతూంటారు. ఉదాహరణకు నేను ప్రత్యక్షంగా చూచిన ఒక విషయం చెపుతాను. మా పెద్దమ్మ కూతురికి (నాకు అక్కయ్యన్నమాట.) అయిదు నెలల క్రితం పెళ్ళయింది. పెళ్ళికొడుకు (అంటే మా బావగారు) ను చూస్తే అందరూ నవమన్మధుడిలాంటివాడని అనుకున్నారు. అంత అందమైన భర్త లభించిన మా అక్కయ్య ఎంతో అదృష్టవంతురాలనుకున్నాను నేను.

కాని "యత్రాకృతిః తత్రగుణాః" అన్న వాక్యం మా బావగారిపట్ల, శుద్ధ అబద్ధమైపోయింది. వ్యభిచారం, త్రాగుడు, జూదం ఇత్యాది సర్వ వ్యసనాలూ ఆయనకున్నాయట. పెళ్ళయి కాపురానికి వెళ్ళిన దగ్గర్నుంచీ ఆ నవమన్మథుడు మా అక్కయ్యపాలిటి నరరూప రాక్షసుడిలా ఆమెను నానా హింసలూ పెడుతున్నాడు. అతగాడి పై అందాన్ని చూచి సర్వలక్షణ గుణసంపన్నుడని భ్రమించిన మా పెద్దమ్మా, పెద్ద నాన్నలు చేసేదేమీ లేక కుమిలిపోతున్నారు. అంతకంటె వారు చేయగలదేముంది?

పైకి వికృతంగానూ, క్రూరంగానూ కన్పించేవారు వారి ఆకృతిలాగే క్రూరంగా, నీచంగా ప్రవర్తిస్తారనుకోవటం పొరపాటని నాకు పదిహేనురోజుల క్రితం జరిగిన ఒక సంఘటనద్వారా అనుభవమయింది.

మా స్నేహితురాలి అత్తగారు ఒకామె ఉన్నారు. ఆమెను చూచినప్పుడల్లా రామాయణంలో తాటకి జ్ఞాపకం వస్తూండేది. బాబోయ్! ఇలాంటి అత్తగారితో మా స్నేహితురాలెలా వేగుతోందో కదా! అనుకునేదాన్ని మనసులో (పైకిమాత్రం ఏమీ అనేదాన్ని కాదు.) మా స్నేహితురాలు ఆమె అడుగులకు మడుగులొత్తడం చూచి ఆమెకు హడలిపోయి అడ్డమైనసేవా చేస్తూంది, అనుకునేదాన్ని.

పదిహేను రోజులక్రితం మేమంతా పిక్నిక్ ప్రోగ్రాం వేసుకుని మా స్నేహితురాల్ని కూడా పిలవాలనుకుని భయపడ్తూ భయపడ్తూ వాళ్ళయింటికి వెళ్ళాను. గుమ్మంలోనే ప్రత్యక్షమయిన అత్తగార్ని చూసి

(63 వ పేజీ చూడండి)

## ఎప్పుడూ ఇంతే—6

శంకర్.








# నేటి చిత్రకారుల స్థితి

(15 వ పేజీ తరువాయి)

దానికి విలువుందో, ఇప్పటివరకు సాగుతూ వచ్చిన భారతీయ చిత్రకళలో చెప్పలేని విషయాలను ఏవిధంగా ఈ ఆధునిక చిత్రకళలో వ్యక్తపరచవచ్చునో, వివరించి చెప్పవలసిన విధి విమర్శకులది, చిత్రకారులది. అలా జరిగిననాడే నిజమైన కళాభిలాష ప్రజల్లో పుడుతుంది. "నగరాజా-పార్వతి" "అలంకరణ" "బుడబుల్లకం", "చెఱువునుండి నీళ్ళు తెమ్మట"లాంటి చిత్రాలు బదులకు, ప్రజల్లో భావపరంపరను ద్విగుణీకృతంచేసి, నిజజీవిత సత్యాలను కండ్లకు కట్టించి, మానసికాభివృద్ధి కలుగచేసే చిత్రాలు ఎప్పుడు వస్తాయి? అలా వచ్చిననాడే చిత్రాలు విద్యావంతులనాకర్షిస్తాయి. వారు కొనటానికి ఆసక్తి చూపుతారు. చిత్రకారుని దారిద్ర్యం తీరుతుంది. ఇదంతా జరగాలంటే చిత్రప్రదర్శనలు ప్రతి ముఖ్యపట్టణములోని జరిపి, ప్రజల్లో జిజ్ఞాసను రేకెత్తించాలి. మనకు మూడు యూనివర్సిటీలు వున్నాయి. ఎన్నో కాలేజీలు వాటిక్రింద నడుస్తున్నాయి. ప్రతి కాలేజి, ప్రతి లైబ్రరి, ప్రతి మ్యునిసిపాలిటి, ఒక్కొక్కటి కనీసం ఒక్కొక్క ఒరిజినల్ పెయింటింగుకొన్నా ఆంధ్రచిత్రకారుల దుస్థితి తీరుతుంది. ఆనాడే ఉత్తేజంతో చిత్రకారులు, నవ్యకల్పనలు, ఉన్నత స్థాయిలో జరుపుతారు. తమ రాష్ట్రానికి, దేశానికి కీర్తి తెస్తారు. అలా జరుగనినాడు చిత్రకారుల దుస్థితి ఎప్పటిలాగే, జీవచ్ఛవస్థితిలోనే సాగుతుంది. న్యాయంజరగాలంటే చిత్రకారులు మనమే పూనుకోవాలి. ఎవరో వచ్చి మనకు ఏమి చెయ్యరు. మనలో ఈ మాత్రం చొరవైనా లేకుంటే, భగవంతుడు కూడ చిత్రకారుల స్థితి మార్చలేడు.

అనుకున్నట్టు ప్రభుత్వమే చిత్రకళా ఎకాడమి నడిపితే, దైవం అనుకూలించక ఏ తెనాలినుండో, ఏ విజయవాడనుండో ఏ కమర్షియల్ చిత్రకారుడో, సృజనాత్మక చిత్రకారులను ప్రాతినిధ్యంవహిస్తూ కమిటీ పెద్దలుగా అయిననాడు, ఎంత బాధపడాలో ఆలోచించండి. ఇది విచిత్రమేమీ కాదు. ఆంధ్రేతరపు ఢిల్లీలోని లలితకళా ఎకాడమీలో ఉన్న సభ్యుడు కమర్షియల్ చిత్రకారుడు. అలా జరుగకుండే అనుభవజ్ఞులైన చిత్రకారులు, విమర్శకులు కళాభిమానులు ఏదో వొకమార్గమేర్పరచి, అన్యాయం జరుగకుండా చూడాలి. భవిష్యత్తును భద్రపరచే బాధ్యత, వారిపైన వున్నదని గ్రహిస్తే, అంతకంటే కావలసింది, కోరవలసింది చిత్రకారులకేమున్నది? ★

# చదరంగం

## దర్భా వెంకయ్య

## శాస్త్ర పద్ధతి

కాంబినేషనులు వచ్చినవే తిరిగి వస్తూంటాయి. వాటిని గుర్తించకపోతే ఆట కళాహీనం అవుతుంది. కాంబినేషన్లని దృక్పథంలో ఉంచుకొని ఆడుతూఉండటం ఆట యొక్క ఉత్తమపద్ధతి. రిఛర్డ్ రెటీ చదరంగాన్ని గురించి అన్న వాక్యాలివి "గణితశాస్త్రంలో సిద్ధాంతాల్ని ధ్రువపరచి వాటిని కొన్ని పరిస్థితుల్లో ఎల్లా ఉపయోగించాలో ఆలోచిస్తాం. చదరంగంలో పరిస్థితులు తెగురుగా ఉంటే వాటిలోని అంతర్యం బాగా గుర్తించి ప్రదర్శించాలి" అని.

ఈ క్రింద మార్షల్ పండితుని కళాసృష్టి పరిశీలిద్దాం.

ఈ క్రింది ఘట్టం లెవిజ్కీ - మార్షల్ లు 1912 సంIIలో ఆడినది.

నలుపు10 - మార్షల్



తెలుపు 9-లెవిజ్కీ

1. ......మ-రాగు 6!!!!
2. విరమణ.

అన్ని విధాల్లోనూ తెలుపు వీగిపోతుంది.

ముఖ్యమైన విధానాలు

A. 2. ఏబ×మ  గు-రా 7 ఆటకట్టు

B 2. మ×మ  గు-రా 7 షా
3. రా-ఏ 1  గు×మ, షా,
4. రా-గు 1  గు-రా 7, షా
5. రా-ఏ 1  ఏ-మఏ 6

నల్ల బలానికి బలం హెచ్చింది.

C. 2. శబ×మ  గు-రా 7 షా
3. రా-ఏ 1  ఏ×ఏ ఆటకట్టు.

1942 లో ప్రఖ్యాత ప్రపంచ ఛాంపియన్ ఆలెఖిన్ Blind fold exhibition లో ఆడగా వచ్చింది.

బలాల పేర్లు:-నఏ, నగు 1 నమ 1 నఏ 1 నరా; నబ 2 నబ, తెగు, నబ, నబ, నబ; నశ, నబ 1 తెగు 4; 2 నబ 1 తెబ, తెగు 2; 2 తెశ 5; తెబ 1 తెఏ 5; 5 తెబ, తెబ, తె; 6 తెరా 1;

1. మ—గు 6!! విరమణ.

ముఖ్యమైన సమాధానాలు పరిశీలిద్దాం.

A. 1. ......శబ×మ
2. గు×బ, షా.  బ×గు
3. ఏ-ఏ 8 షా  మ-ఏ 5
4. ఏ×మ ఆటకట్టు.

B. 1. ......ఏబ×మ
2. ఏ-ఏ 8 ఆటకట్టు

C. 1. ......శ×శ
2. మ×గుబ ఆటకట్టు

D. 1. ......మ×గు
2. మ×గుబ ఆటకట్టు.

ఈ దిగువ ఘట్టాన్ని గురించి చమత్కారం ఉంది. 1916 సంIIలో జనోస్కీ - ఛేజిస్ ఆడిన ఆటలో నడిచింది ఈ ఘట్టం.

ఛేజిస్ - నలుపు 13



జనోస్కీ - తెలుపు 13

ఆట యిల్లా నడిచింది.

1. శ×బ షా!  రా×శ
2. మ-ఏ 5 షా  రా-గు 1
3. మ×బ షా  రా-ఏ 2

సరిగా ఇదేస్థితి మికెనాస్-కొష్ డాన్‌లమధ్య 1931 లోనూ వచ్చింది. మికెనాస్ మంత్రితో షాలు చెప్పి సమ చేశాడు. జనోస్కీ ఆడినక్రమం చూద్దాం.

4. గు—మ 7  గు×గు
5 ఏ×గు  శ-శ 3
6 గు-రా 4!!

బహు చక్కని ఆలోచన

6. ......శ×ఏ అయితే 7. గు×శ ఆటకట్టుకు త్రోవ యిస్తుంది.

6. ......శ×గు అయితే 7. మ×శ! జరిగిన క్రమం.

6, ......శ×బ 7. గు-గు 5 షా రా-ఏ 3.

8. బ-గు 4! బ-గు 3 రాజు గుఱ్ఱాన్ని చంపితే 2 ఎత్తుల్లో ఆట పోతుంది.

9. బ-రాఏ 4  ఏ-ఏ 1
10. గు-ఏ 7 షా!

నా మొదటివ్యాసం, ఈ వ్యాసంలోనూ కల్పన (Combination) కు కొన్ని ఉదాహరణలు చూచేము. వీటిని వివిధరకాలుగా పండితులు విభజించేరు. వాఙ్మయంలో పద్య రచనలా ఉంటుంది, ఈ కల్పన.

కల్పనకు అవకాశాన్ని యిచ్చే బలాన్ని అనుగుణ్యమైన స్థానాల్లోకి తేవాలి. అందుకు ప్రయత్నించాలి. లభ్యం అయిన పరిస్థితుల్ని సకాలంలో సక్రమంగా వినియోగించాలి. అంచేత చతురంగానికి శాస్త్ర పద్ధతి వచ్చింది. దాన్ని (Chess theory) అంటారు.

## 11 వ సమస్య:

నలుపు-9



తెలుపు-10

4 నఏ, నఏ. నరా 1; నబ 5 నబ, నబ; 8; 2 తెబ 3 తెమ 1; 5 నగు, నగు 1; 1 తెగు 6; తెబ, తెబ 3 నమ, తెశ, తెబ; 2 తెఏ 8 తెఏ, తెరా.

ఎత్తు నల్ల బలానిది.

నల్ల బలం, తెల్ల రాజుని 3 ఎత్తుల్లో కట్టాలి.

## 10 వ సమస్యకు పరిష్కారం

మ—గు 3. బ—శ 5 అయితే;
2. మ—గు 2 షా.
బ—రా 5 అయితే; 2 మ—గు 8 షా.
రా—శ 5 అయితే; 2. మ—మ 8 షా.

## విజ్ఞప్తి

"కథ కానికథ" శీర్షికకు వచ్చే వందలాది రచనలలో నిరాకరింపబడిన వాటిని త్రిప్పి పంపటం సాధ్యంకాదు గనుక, రచనలతో పాటు స్టాంపులు పెట్టవలదని, వాటి విషయమై ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపుటకు కూడా వీలుండదు గనుక కార్డులు, రిప్లయి కార్డులు పంపరాదని రచయితలకు మనవి. ఈ శీర్షిక రచనల కవర్లపై స్పష్టంగా "కథ కానికథ" ఎడిటర్, ఆంధ్రసచిత్రవారపత్రిక 6 & 7, తంబుచెట్టి స్ట్రీట్, మద్రాసు-1. అని వ్రాయాలి. —సంపాదకుడు.




## బొంబాయి లేఖ

అక్టోబరు 11 ఆదివారం ఉదయం, శోభన సమర్థ్ ప్రథమ పుత్రిక నూతన్‌కు వివాహం జరిగింది. వరుడు భారత నౌకాదళానికి చెందిన లెఫ్టినెంట్ కమాండర్ రజనీష్ బాల్. వివాహం చెంబూర్‌లో శోభనసమర్థ్ గృహంలో, ఏమంత ఆర్భాటం లేకుండా జరిగింది. తరువాత తార్దేవ్‌లోని సెంట్రల్ స్టుడియోలో విందు జరిగింది. నగరంలోని సినిమావారు దాదాపు యావన్మందీ మహూర్తానికి విందుకూ వచ్చి, వధూవరులను దీవించారు.

పెళ్లి అయింది కాబట్టి ఇక నూతన్ సినిమాలో నటించదని కొందరు అంటున్నారు. కొందరు అనుకుంటున్నారు. ప్రస్తుతానికి మటుకు అది సమస్య కాదు. ఎందుకంటే నూతన్ ఇంతకు ముందు ఒప్పుకున్న చిత్రాలు—ఇంకా నిర్మాణం ఆరంభించనివి రెండు వున్నాయి. దర్శక నిర్మాత ఒకటి నరేంద్ర సూరి తలపెట్టినది; రెండవది సుభాష్ దేశాయి చిత్రం ఛోటీ సి దునియా. దీనికి రచయిత ఇందర్ రాజ్ ఆనంద్ దర్శకత్వం నిర్వహిస్తున్నాడు. మొదటి చిత్రంలో సునీల్ దత్ తోను, మరో చిత్రంలో రాజ్ కపూర్ తోను నటిస్తుంది. ఆతరువాత ఏమి చేస్తుందీ అన్న ప్రశ్నకి జవాబు వెండితెరమీద చూదాం.

### కొత్త నటి

బొంబాయి చిత్రసీమలో కొత్త నటీనటులకు ప్రోత్సాహం సమృద్ధిగా లభిస్తోంది. లోగడ చేసిన ఉపన్యాసాల, వాగ్దానాల మేరకు కొందరు పెద్ద దర్శకులూ నిర్మాతలూ స్టార్‌లతో పోరు పడలేని చిన్న నిర్మాతలూ కూడా ధైర్యంగా కొత్తవాళ్లని తీసుకుంటున్నారు. సయిదాఖాన్, ఆశాపరేఖ్, వహీదా మొదలైనవారు త్వరలోనే కనిపించబోతున్నారు. ఈ శ్రేణిలోకి వచ్చిన సరికొత్త నటి సీమ. ఈమె మహారాష్ట్ర సినీనటి. దర్శకుడు మహేష్ కౌల్ ఈమెను హిందీ ప్రేక్షకులకు పరిచయం చేయబోతున్నారు. అనుపమచిత్ర (తలాక్, సంతాన్) సంస్థకు అయిదేళ్ళ కాంట్రాక్టుపై ఈమె బుక్ అయింది.

సీమ సన్నగా పొడుగుగా నాజూగ్గా ఉంటుంది. కందిరీగ నడుముకి ఒక్క వానికి ఎక్కువున్న నడుము. అందానికి ఆరోగ్యం తోడై ఈమె చాలా ఆకర్షణీయంగా అగుపిస్తుంది. స్థూల బాలలను చలాకీ అమ్మాయిలుగా చూసి సరిపెట్టుకోలేకపోతున్న ప్రేక్షకులను సీమ తప్పకుండా ఆకరిస్తుంది. మహారాష్ట్ర యువతి అయినా హిందీ ఉచ్చారణ బాగుండటం వల్ల సీమ త్వరలోనే ఉచ్చస్థితిని అందుకోగలదని అనుపమ చిత్ర నిర్మాతలు ఆశిస్తున్నారు.

సుధాకర్ ఫిలింస్ వారి 'వచ్చినకోడలు నచ్చింది' చిత్రంలో కన్నాంబ, రామారావు, జమున.



విఠల్ ప్రొడక్షన్సువారి “పెళ్లిమీద పెళ్లి” లో కృష్ణకుమారి.

అనుపమ చిత్రవారు మహత్తరమైన ఉద్యమం ఒకటి తలపెట్టారు. రామాయణాన్ని రంగులలో పెద్ద తెరమీద చలనచిత్రంగా నిర్మించడం.

బిమల్ రాయ్ ఈ ప్రయత్నంలో ఉన్నట్లు ఏడాది క్రితం ప్రకటించడం విదితమే.

అనుపమవారి రామాయణానికి రచయిత ముఖ్రం శర్మ, సంగీతం వసంత్ దేశాయ్, దర్శకత్వం మహేష్‌కౌల్.

చాలా శ్రద్ధగా ఇందుకై కృషిచేస్తున్నట్లు గతవారం ఈ విషయం వెల్లడిస్తూ మహేష్‌కౌల్ అన్నారు. ఆ రోజు ఆయన మెహబూబ్ స్టుడియోలో, అనుపమ చిత్రవారి 'ప్యార్ కి ప్యాస్' చిత్రం షూట్ చేస్తున్నారు. గేవాకలర్, సినిమాస్కోప్‌లో తీస్తున్న ఈ చిత్రంలో నిషీ ముఖ్యపాత్ర ధరిస్తూంది. మిగతావారంతా అవకాశం ఉంటే, పెద్దవారికన్న గొప్పగా నటించగల 'చిన్న' నటులు. మహేష్‌కౌల్‌కు తనమీదా ఎదటివాడిమీదా కూడా నమ్మకం ఉంది. కష్టపడి పనిచేస్తే ఫలితం బాగుంటుందన్న ధైర్యం ఉంది. ఆరోజున ఐదుగురు పిల్లలతో ఒక అల్లరి సన్నివేశాన్ని తీస్తున్నారు. పిల్లలు, వద్దు మొర్రో అంటేనే అల్లరి చేస్తారు. చెయ్యినాయనా అంటే ఇక చెప్పనక్కరలేదు.

వాళ్ళందరిచేతా తనక్కావలసిన పద్ధతిలో అల్లరి చేయించడానికి మహేష్‌కౌల్ నానా శ్రమా పడుతున్నారు.

ఎందుకొచ్చిన గోలా అన్నారెవరో.

పిల్లలు కాపోతే అల్లరి మనమూ చేస్తాం. అన్నారు మహేష్‌కౌల్.

## అబ్బాస్,

రచయిత, సినీరచయిత, దర్శకుడు, నిర్మాతఅయిన ఖ్వాజాఅహమద్ అబ్బాస్ ఎప్పుడూ ఏదో ఒకొత్త హంగు లేకుండా చిత్రం తీయడు. 'అన్హోనీ'లో నర్గీస్ చేత తొలిసారి(ఆమెకు) రెండు వేషాలు వేయించాడు. 'రాహీ', ప్రప్రథమంగా అస్సాం టీ తోటల వంటి అపూర్వమైన (సినిమాకి) కథాస్థలం తీసుకొని అక్కడి కార్మికుల జీవిత సత్యాలు చర్చించింది. మున్నా, ఒక చిన్న పిల్లడు ముఖ్యపాత్రగా గల వాటిలో ఉత్తమశ్రేణి దనిపించుకుంది. పరదేశి, సోవియట్ కళాకారులతో కలసి తీసిన చిత్రం. ఇపుడు 'చార్ దిల్ చార్ రహీ' చిత్రం మరో విధంగా విశిష్టమైనది. ఇందులో ఉన్నంతమంది పెద్దతారలు ఇంకెందులోనూ లేరు.

## దుర్గాష్టమికి

దుర్గాష్టమినాడు రెండు కొత్తచిత్రాలకు



పారగన్ సినిమాలో గతవారం “బాలనాగమ్మ” ప్రేడ్‌షోకు హాజరైన కబీర్ దాసు, చం పతిరావు, రంగారావు, వేదాంతం రాఘవయ్య, చాణక్య, టి. వి. రాజు, సముద్రాల జూనియర్, శ్రీ వెంకటరమణా” నిర్మాతలు, డిస్ట్రిబ్యూటరు రాజుగారు.

# చిత్రసమీక్ష:

# భాగ్యదేవత

అభినయం: సావిత్రి, జగ్గయ్య, రాజసులోచన, బాలయ్య, రేలంగి, లక్ష్మి, పెరుమాళ్లు, సూర్యకాంతం, నిర్మల, కోంపెల రావు. కథ, మాటలు తాపీ ధర్మారావు, పాటలు శ్రీశ్రీ, కొసరాజు, తాపీ. సంగీతం. "మాస్టర్" వేణు, గానం సుశీల, జమునా రాణి, పిఠాపురం నాగేశ్వరరావు. దర్శకత్వం తాపీ (పెద్దిరికాలు, ఎత్తుకు పైయెత్తు) చాణుక్య. కథాస్థలం హైదరాబాద్ శ్రీసారథీ స్టుడియోలోని రెండు ఫిలిం సెట్లు.

నిర్మాత. వై. రామకృష్ణ ప్రసాద్.

అపోహలమీద మనుష్యుల్ని మరబొమ్మల్లా గిరగిర తిప్పి గంతులు వేయించి వాళ్ళ గుణావగుణ గణాలను వెల్లడిచేసే పద్ధతినీ, చిమంత చిక్కును కొండంత కష్టంచేసి చూపి మంచల్లె కరిగించి పారేసే పద్ధతిని ఏనాడు ఎవరు కనిపెట్టారో గాని, మొత్తానికి ఈఅపోహ చాలామంచిది. ఆ వ్యూహ, కదిలీ కదలని కథలను ఒక్కతోపు తోస్తుంది ముందుకు. సాగని కథలను తెగ సాగదీస్తుంది.

ఊహ మంచిదైనకొద్దీ అపోహ మరీ బాగుంటూ వుంటుంది. శ్రీ సారథీ స్టుడియోస్ (హైదరాబాద్) వారి 'భాగ్యదేవత' చిత్రంలో కొత్తఊహ అంటూ ఏదీలేదు. తప్పుచేసినవాడు గ్రూపు ఫోటోలో చేరడం కోసం నాలిక్కరుచుకుని నన్ను క్షమించు అంటూ దగ్గరలోఉన్న వాళ్ళ కాళ్ళమీద పడడం తప్ప. ఇది ఊహ అవనిమాట నిజమే అయినా మరోటి లేనందువల్ల దీన్నే ఆ పేరిట పిలుచుకోవచ్చు. ఏది ఏమైనా మొత్తానికి ప్రతి సినిమాలోనూ వచ్చే ఈ ఏర్పాటుకు ఇందులో తొడిగిన కథ కొత్తది. ఒక విలక్షణ స్థితిని హృదయంగామంగా చిత్రించ తలపెట్టినది. చురుకైనది. తాపీ చాణక్య సారధ్యాన వేగంగా పరిగెడుతుంది. ఎటొచ్చీ ఈపరుగు, వేగంగా దొర్లుతున్న చక్రంలోపల - ఉన్నచోట ఉండడానికి హైరాణపడే ఉండేలు పరుగులాటిది. పరుగు దర్శకుడూ, హైరాణ

నటులూ వహించారు.

ఒక లేటు జడ్జిగారికి ఇద్దరు కుమార్తెలు, రాజసులోచన లాటి లలితా, సావిత్రిలాటి సరోజ. వాళ్ళమ్మగారు, ఆ స్తికి ఇంటికి అధికారి కాబట్టి ఓపెద్ద కాలువాక ప్పుడు గంభీరంగా ఉంటుంది. పెద్దపిల్ల లలితను తాసీల్దారు గారి కుమారుడికిచ్చి పెళ్ళిచేయాలని, లేటు జడ్జిగారు, కథారంభం నాటికి చెలామణీలో ఉన్న పెద్దలూ నిశ్చయిస్తారు. లలితకు ఇంకో రెండు రీళ్ళ తరవాత డాక్టర్ 'బాలయ్య'ని చూసేవరకూ పెళ్ళి మీద ధ్యాసే ఉండదు మాశాక అతన్ని చేసుకో వాలనుకుంటుంది. పబ్లిక్ గార్డెన్స్‌లో పబ్లీగ్గా డూయెట్లు పాడుతున్నా తనమనసులోమాట తల్లికి చెప్పకుండా గుట్టుగా ఉంచి, ముహూర్తం వేళకి పరారీ అయిపోతుంది. పెళ్ళివారు ఇదేమని కోపగించుకునేవరకు, చిన్నకూతురు సావిత్రి, కాబోయిన అక్కమొగుణ్ణి తనే కట్టుకుని మాట దక్కిస్తుంది. తాశిల్దారుగారి అబ్బాయి జగ్గయ్య, తప్పిపోయిన పెళ్లికూతురు మీదనే పగబట్టి, గురిపెట్టి ఆమె కాపరం ధ్వంసం చేయ చూస్తాడు. లలితకు భర్తకు మధ్య స్త్రీ స్వాతంత్ర్యము అవసరమా అనే విషయంపై

## బొంబాయి సినివార్తలు

ప్రారంభోత్సవాలు జరిగాయి. కిరణ్ ప్రొడక్షన్స్ వారి 'ఉన్‌పథ్' (నిరత్న రాస్యుడు) లో మాలాసిన్హా బలరాజ్ సాహ్ని నజీర్ హుసేన్, ధుమల్, ధర్మేంద్ర, శశికళ నటిస్తున్నారు. రెండవ చిత్రం సుభాష్ దేశాయ్ నిర్మిస్తున్న 'చోటీ సీ దునియా'. నాయకా నాయకులు నూతన్, రాజ్ కపూర్.

ఉన్‌పథ్ చిత్రానికి దర్శకుడు మోహన్ సైగల్ స్క్రిప్ట్ రాసిపెట్టారు, దర్శకత్వం చందర్ సైగల్ నిర్వహిస్తారు. సంగీతం మదనమోహన్ సమకూర్చుతారు. ఛోటీ సీ దునియాకు రచయిత ఇందర్ రాజ్ ఆనంద్ దర్శకుడు, సంగీత దర్శకులు కల్యాణ్‌జీ ఆనంద్‌జీ.

—ఆస్ట్రాన్.





లలితకళానికేతన్ (రాజమండ్రి) వార్షికోత్సవసందర్భంగా అక్టోబరు రెండోవారంలో కళాకారులకు సన్మానాలు జరిగాయి. ఎడమనుండి: నటుడు రేలంగి, అవార్డు గ్రహీత చిత్ర రచయిత సోమంచి యజ్ఞన్నశాస్త్రి, ప్రసిద్ధరంగస్థల నటుడు గండికోటజోగినాథం, నాట్యశాస్త్ర ప్రవీణుడు నటరాజ రామకృష్ణ, నటుడు రమణారెడ్డి; సన్మాన సంఘం అధ్యక్షుడు బచ్చు సత్యానందం.



శ్రీ రామాఫిలింస్ వారి 'భక్త అంబరీష'లో వల్లం నరసింహారావు, రంగారావు.

(సంసారులు డాన్సులు చేయవచ్చా?) వాద ప్రతివాదాలు జరుగుతున్నందువల్ల జగ్గయ్య రాకపోకలు, డాక్టరులో భాగ్యశీలంపట్ల అపోహాలు కలిగిస్తాయి. ఇద్దరూ వేరైపోతారు.

భర్తకు నచ్చచెప్పి, నిజం చెప్పించి ఈ అపోహ తొలగించే బాధ్యత సరళమీద ఉంటుంది. అత్తగారు చండశాసనురాలు అయి ఇల్లు కదలనివ్వనందువల్ల ఆమె ఏ సాహసాలూ చేయలేకపోతుంది. అందువల కాంపౌండర్ రేలంగి మారువేషాలు వేసి రాజసులోచన (లలిత) చేత వేయించి కథనో కొలిక్కి తెస్తాడు. ఆ వేళకి, ఖూనీ కేసులూ, లారీ ప్రమాదాలూ, రైలు ప్రమాదాలూ ఆగుకుని సమస్యను పరిష్కరిస్తాయి. జగ్గయ్య తమిళ చిత్రాలలో శివాజీ గణేశన్‌లా పెద్ద పెద్ద కేకలు వేసి, హడావుడి చేసి లలిత మహాపతివ్రత అనీ, తన తల్లి అనీ (నిజంగా కాదు) దేవత అనీ భాగ్యదేవత అనీ ఉద్ఘోషిస్తాడు. సావిత్రి కూడా తమిళ చిత్రాలలో కన్నాంబనల్లె సుదీర్ఘమైన సంభాషణలు చెబుతుంది.

సన్నివేశాన్ని ఉద్వేగభరితం చేయడానికి ఇలా అతిశయోక్తి పద్ధతిలో భూతద్దం కింద పెట్టి చూపితే ప్రేక్షకులకు హత్తుకుంటుందని సినిమావారు అంటారు. ఈ చిత్రంలో ఇదే కాక, మొత్తంమీద అన్ని పాత్రలూ ఈ శిల్పంలోనే రూపొంది తిరిగాయనిపించింది.

దాన్ని బట్టే ఆయా పాత్రధారుల నటన కూడా అందుకు తగ్గవిధంగానే "అత్యంత సమర్థంగా" సాగింది. ఒక్క బాలయ్య మటుకు తొణుకూ బెణుకూ లేకుండా స్థిమితంగా నిబ్బరంగా మాట్లాడాడు.

పక్కుబాయి మార్కు కోడలుగా నటించడం సావిత్రికి పూర్తిగా నచ్చినట్లు తోచదు. కథ బలీయం కొట్టి ఊరుకుంటున్న హీరోయినులా వ్యవహరించిందామె. పెరుమాళ్లు, కొత్తగా ప్రాణానికి హాయిగా ఉన్నాడు. సూర్యకాంతం అత్తగారి ధాటి నిజానికి మితిదాటిపోయినా, ఆమె హడావుడి, రేలంగి నటన ఈ చిత్రాన్ని ఉత్సాహంతో నింపివేశాయి. ఇదీ, కొత్త పెళ్ళికూతుళ్లు శోభనంగదిలో పాటలుపాడుతూ డాన్సులకు పడికట్టడం, సావిత్రికి కొండంత సమస్య నెత్తిన పడ్డపుడు ఏంపాలుపోక ఏడుస్తూ పాట పాడడంవంటి సరికొత్త పాత గమ్మత్తులూ చక్కని వినోదం సమకూర్చుతాయి.

## వార్తావరణం

కథ కమామిషూ పూర్తిగా ముందర రాసి అట్టే పెట్టుకొని, చకచక మూడునెల్లలో చిత్రం తీసివేసే పద్ధతిని మన్నించే నిర్మాతలలో అగ్రగణ్యులు సుందర్‌లాల్ నహాతా, టి. అశ్వత్థనారాయణ. శ్రీ ప్రొడక్షన్స్, రాజశ్రీ ప్రొడక్షన్స్‌ల పేరిట వీరింతవరకు తీసిన చిత్రాలు జయం మనదే, సతీ అనసూయ, మంచిమనసుకు మంచిరోజులు, శభాష్ రాముడు ప్రజాదరణ పొందాయి. ఇపుడు ఐదవచిత్రం 'శాంతి నివాసం'ను మొన్న దసరా పండుగనాడు ఆరంభించారు. సంక్రాంతికి విడుదల చేయడానికి కార్యక్రమం వేసుకొన్నారు. దర్శక నిర్మాత ఎస్. ఎమ్. శ్రీరాములు నాయుడు ప్రారంభోత్సవం జరిపారు. బి. నాగిరెడ్డి. పి. పుల్లయ్య సి. పుల్లయ్య, ఎన్. టి. రామారావు, వచ్చి శుభాభినందనలు తెలిగా తెలియచేశారు.

ఈ చిత్రంలో ఎ. నాగేశ్వరరావు ముఖ్యపాత్ర నిర్వహిస్తున్నారు. నాగయ్య, రేలంగి, కాంతారావు, రమణారెడ్డి, కె. వి. ఎస్. శర్మ, రాజసులోచన, సూర్యకాంతం, దేవిక, కృష్ణకుమారి, సురభి బాలసరస్వతి, హేమలత మొదలగువారు పాల్గొంటున్నారు. శాంతినివాసం ఒక తమిళ నాటకానికి అనుకరణ. తెలుగు నాటకం (పాలగుమ్మి పద్మరాజు) ఆంధ్రలో చాలా చోట్ల ప్రదర్శించబడింది.

ఇపుడు ఈ నవచిత్రానికి సముద్రాల జూనియర్ కథను రూపొందించి మాటలూ పాటలూ వ్రాస్తున్నారు. మంచి మనసుకు మంచిరోజులు, శభాష్ రాముడు చిత్రాలు తీసిన సి. ఎస్. రావు దర్శకత్వం నిర్వహిస్తారు. ఛాయాగ్రహణం కమల్ ఘోష్. సంగీతం ఘంటసాల.





శ్రీ నాట్యభారతీ ప్రొడక్షన్స్‌వారి కొత్త చిత్రానికి విజయదశమినాడు ప్రారంభోత్సవం జరిగింది.





# స్నేహలత

(13-వ పేజీ తరువాయి)

మామగార్ని అవ్వాలి. మరి నా కోరిక తీరుస్తావా?" అన్నాను.

'అంటే నీవుద్దేశ్యం నాకర్థం అవటం లేదు.'

"అంటే ఏమీ లేదు. నాకు పుట్టేటూతర్ని నీకోడలిగా చేసుకోవాలి" అన్నాను నవ్వుతూ.

'అయ్యో! ఎలాగా! మాటకి మాట ఇచ్చేశానే! అది వక్కటేనా నీకు దొరికిన కోరిక. ఇంకేదయినా కోరుకో. అయినా అంత తొందర ఏమిటి? ఇంకా నీకు పెళ్లి కాలేదుగా" అంది.

"కాలేదనుకో. ఎందుకైనా మంచిది, ముందే మాటపుచ్చుకుందామని. ఈ వారం ఒకమ్మాయిని చూడడానికి వెళుతున్నాను. చాలా బావుంటుందిట. మూడు వందలు పెటేల అయిపోవచ్చు. ముందుగానే నీదగ్గర మాటపుచ్చుకుందామని వచ్చాను. కానీ ఈ సారి పుట్టే బాబుకి చేసుకుంటావా?" అని అప్రయత్నంగా అడిగేశాను.

సంధ్య మొహం సిగ్గుతో ఎర్రబారింది.

"ఛా! ఏమిట వేళాకోళం! చేసుకోకపోతే మా ఇంటికిరావా? అయినా ఎప్పటి సంగతోకదా. ఆలోచిద్దాములే" అంది.

ఇలా మాట్లాడి నేను ఇంటికి వచ్చేశాను. నాన్నగారిదగ్గరనుండి వెంటనే బయలుదేరి రమ్మని ఉత్తరం వచ్చింది. మర్నాడు ప్రొద్దుటే వెళుతూ సంధ్యకి చెప్పి వెళ్దామని వచ్చాను. కాని ఇంట్లో ఎవ్వరూ లేరు. ఒక నౌకరు నిలబడివున్నాడు. ఎక్కడికి వెళ్ళారని అడిగాను. 'అమ్మగారి తండ్రికి చాలా ప్రమాదంగా వుందిటండి వూరికి వెళ్ళా'రని చెప్పాడు.

తరువాత నేను యింటికి తిరిగివచ్చి నాన్నగారిని తీసుకుని బయలుదేరాము. నేను అనుకున్నట్లుగానే పెళ్లిచూపులకని వెళ్లాము. పెళ్ళి పిల్లను చూశాను. చాలా బావుంది. కోలముఖము. చాలా నాజూకుగా వుంది. కాంతివంతమైన ముఖం. బంగారు ఛాయగల శరీరం. అద్దాలవంటి చెక్కిళ్ళు, సౌందర్యం, సౌకుమార్యం ఆమె సొత్తు. ఆ కన్నులలోనుండి ఆమె సౌశీల్యం తొంగి చూస్తున్నది. నిజంగా నేను అదృష్టవంతుడిని అనుకున్నాను. ఆమె నా భార్య కాబోతుందిగదా అని ఆనందంగా వుండలేను. ఎవరు చూసినా ఆమెను అలాగే వర్ణిస్తారు. పేరు శశిప్రియంవద. సంధ్య స్నేహితురాలు శశి, ఈమె ఒకటే కావచ్చని అనుమానం కల్గింది. కాని ఎప్పుడూ సంధ్య ఈమె పూర్తి పేరు చెప్పలేదు. ఇంక ఆ ఏడాదికి

## ★ పుష్పించిన స్నేహలత ★

ఆఖరిముహూర్తం సరిగ్గా పదిరోజులు వుందనటంవలన, అదే ముహూర్తానికి మా వివాహం నిశ్చయించారు. నేను సంధ్యకి ఆహ్వానంతోపాటు ఉత్తరంరాసి తప్పకుండా రమ్మనమని రాశాను. పెళ్ళి రోజున కనీసం గ్రీటింగ్సుకూడా రాలేదు. ఒకవేళ వాళ్ళ మామగారికి చాలా యస్‌గా వుందేమో ననుకున్నాను.

శశికూడ పీటలమీద చాలా పరధ్యా గావుంది. తరువాత అడిగితే తనప్రియమైన స్నేహితురాలు రాలేదని, కనీసం గ్రీటింగ్సుకూడా పంపలేదని. నేను

—తురాలు పేరు అడగటం మర్చిపో
ను. అన్నీ సవ్యంగా జరిగిపోయాయి.
లవులేకపోవటంవలన తిరిగి వచ్చే
శశిని తర్వాత పంపుతా నన్నారు.
పెళ్ళినుండి తిరిగిరాగానే సంధ్యయిం
...్ళను. కాని అప్పటికి వాళ్ళు
ను. తరువాత సరిగ్గా నెలరోజులకు
రేపువస్తుందనగా సంధ్య దగ్గరకి సాయం
 వెళ్ళాను. వాళ్ళు వూరునుండి తిరిగి
...రు గాని. ఎక్కడికో వెళ్ళారని
...తే తిరిగిరారని చెప్పాడు నౌకరు. సరే
...గా సతీసమేతంగా రావచ్చునని తిరిగి
...పోయాను. ఇంటికివచ్చి ఎప్పుడు తెల్ల
రుతుందీ అని చూశాను. అతికష్టంమీద
...రింది. గబగబ డ్రెస్సు చేసుకుని
...దేరాను. నా అదృష్టంకొద్ది ఆవేళ
...న్ కరెక్టు టైము. సరే ఫ్లాట్ ఫారమ్
కొని స్టేషన్లోకి వెళ్ళాను. అనుకో
...నా అక్కడ సంధ్య కనపడింది. "సం
!" అని పిలిచాను. వెనక్కి తిరిగి
సింది.

"ఎన్నాళ్ళకి చూశాను సంధ్యా! మీ
మగారు కులాసాగావున్నారా? ఎప్పుడు
వచ్చారు మీరంతా" అని అడిగాను.

"ముందు కంగ్రాచ్యులేషన్స్, గ్రీటిం
గ్సుకూడ పంపలేకపోయాను. మేము నిన్న
మార్నింగ్ వచ్చాము. మామగారు కులా
సాగా వున్నారు. ఇవాళ ఈ ట్రెయిన్లో
మా శశి వస్తోంది. పెళ్ళయిందిట.
నేను వెళ్ళలేక పోయాను. శశిని చూడా
లన్న ఆత్రుతకొద్ది పరిగెత్తుకు వచ్చాను.
నువ్వు ఏపనిమీద వచ్చావు?"

"ఇవాళ మా శ్రీమతిగూడ ఈ ట్రెయిన్
లో వస్తోంది. సాయంత్రం మీ యింటికి
తీసుకువద్దా మనుకున్నాను." అని అంటూ
...గానే బెల్ కొట్టాడు. ట్రెయిన్
...ప్పి ఆగింది. సంధ్య ఒక వేపు పరిగెత్తింది.
...గూడ జనాన్ని తోసుకుంటూ కంపార్ట్
...ంట్స్ వెతుకుతున్నాను. కలగంటు
న్నానో నిజంచూస్తున్నానో తెలియలేదు.
...ంధ్య, శశి ఒకరిచేతులు ఒకరుపట్టుకుని
...డుకుంటున్నారు.

"శశీ" అన్నాను.

సంధ్య ఆశ్చర్యానికి అంతులేదు.

"అనుకోని సంఘటన కదూ గోపాల్!"
అంది.

"అయితే మా అల్లుడు ఏడీ?" అన్నాను.
మా శశిముఖం సిగ్గుతో ఎఱ్ఱబారింది. సం
ధ్య సంతోషానికి అంతులేదు.

"ఎంత దొంగవి నువ్వు! చెప్పనైనా
...ు."

"చెప్పటానికి టైములేదు సంధ్యా! పరి
...తులన్నీ అలా వచ్చాయి. సంధ్యా! నా
శశి, నీ శశి ఒక్కటే. ఆశ్చర్యం కదూ!"
అన్నాను.

"అయితే నేను భయపడ నక్కర్లేదు.
ఇద్దరిమాట చెల్లించుకుంటాను. ఇంక మిగతా
పనంతా మా శశిదే. ఏం 'శశి' ఏ మంటావు!
తొందరగా కోడల్నియ్యాలి" అంది.

శశి ముఖపద్మం మరొకసారి సిగ్గుతో ముకు
ళించుకు పోయింది. అందరం ఫకు క్కన
నవ్వాము.

సామాను యింటికిపంపి తిన్నంగా అంద
రము సంధ్య యింటికి వెళ్ళిపోయినాము. ఆ
రోజు నిజంగా జన్మలో మరపురాని రోజు.
శశి, సంధ్యల స్నేహాలత తీగెల్లి పెనవేసు
కుంది. ★

# "యత్రాకృతిః తత్రగుణాః"

[51-వ పేజీ తరువాయి]

గానే నాగుండె గుభేలుమంది! ఏమనా
అంటుందేమోనని భయపడ్తూ "ఏమండీ
మా ఫ్రెండును పిక్నిక్‌కి పంపిస్తారా?"
అని అడిగాను. ఆమె నన్నెంతో ఆప్యా
యంగా ఆహ్వానించి మా స్నేహితురాలు
వెళ్ళనిచెప్పినా "ఈ వయసులో ఉన్న
వాళ్లకు సరదాలు లేకపోతే నాకుంటాయా?
ఈ ఒక్కరోజు వంటా నేను చూసుకో
గలనులే. నువ్వు తప్పకుండా వెళ్ళమ్మా!"
అని బలవంతంచేసి పిక్నిక్‌కి కావలసిన
సామానంతా తానేసర్ది కోడలిని పంపిం
చింది. కోడలిమీద ఆమెకున్న అప్యాయత
ఆదరణ చూస్తూంటే "ఛీ! ఈమెనుగురించి
నేనెంత అపోహపడ్డాను!" అన్పించింది.
ఆమె బాహ్యాకృతి వికృతమైనదైనా ఆమె
హృదయం అమృతతుల్యమైన దనుకు
న్నాను అప్పుడు. అప్పటినుంచి ఆకారాన్ని
బట్టి గుణగణాలను నిర్ణయించుకోటం మాను
కున్నాను.

చందనపు బొమ్మల్లాంటి కోడళ్ళను తెచ్చు
కుని కొడుకుకు ఎడబాటై కుమిలిపోతున్న
తలిదండ్రుల్ని, కయ్యానికి కాలుదువ్వి
కుటుంబాన్ని నరకతుల్యంచేసే సుందరీ
మణులను, అందాన్ని ఆధారంగా చేసుకుని
అనేక సంసారాలను మట్టిపాలుచేసే నవనారీ
మణులనూ, చిరునవ్వు చిలకరిస్తూ హృద
యంలో విషబిందువులు గిలకరించే స్త్రీ
పురుషులను కలియుగంలో కోకొల్లలుగా
చూస్తూంటాం.

ఏదోఒక సందర్భంలో మహాకవి భవభూతి
సౌందర్యం సద్గుణాలు మేళవించి ఉన్న
వ్యక్తిని చూచి యత్రాకృతిః తత్రగుణాః
అని ఉండవచ్చు. అంతేకాని సర్వత్రా ఇది
వర్తిస్తుందని ఆయనభావం కాదు. ★

# ఆంధ్రపత్రిక గళ్ళ నుడికట్టు-4

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 | 2 | | 3 | ■ | 4 | | 5 | |
| ■ | | ■ | 6 | 7 | | ■ | | |
| 8 | | | | | ■ | ■ | 9 | |
| 10 | | ■ | 11 | | 12 | ■ | 13 | |
| ■ | ■ | 14 | | ■ | 15 | | ■ | |
| 16 | 17 | ■ | 18 | 19 | | ■ | 20 | |
| 22 | | ■ | | ■ | | ■ | 23 | |
| ■ | | ■ | 24 | | 25 | ■ | | ■ |
| 26 | | | | ■ | 27 | | | |

## అడ్డం ఆధారాలు

1. అంతే భేదంతో శిష్యుడు వస్తాడు.
4. నూతులో ఉంటూ ఆకాశం ఇంతే అనుకునేది.
6. రాముని చుట్టం.
8. 8 నిలువు వెయ్యటానికి ఇది వెయ్యాలి.
9 ఇది పోసిన పిట్ట తెగవాగుతుంది.
10 తెలుగు వృక్షం.
11. మా పళ్ళే మాకందం అనే చెట్టు.
13 సంరంభములో తావలచినది.
14. కైజారు తనలో దాచిన చక్రవర్తి.
15. డప్ డప్ మని మోగేది.
16 ఆరాటముతో కూపి తీయటం.
18. చెల్లా చెదరైంది అద్దె.
20. భామ! జాగేలా! అనుటలో వినోదం.
22. ఒక జిల్లా బాస ఇంకో జిల్లాకు ఇలా ఉంటుంది.
23. తెలుగు వ్రతము.
24. వికృతి వేషము.
26. ఇది ప్రాకేది, ఎగిరేది కూడాను.
27. అష్టాంగ యోగంలో రెండో నిబంధన.

## నిలువు

2. కదిపితేనె పట్టుకుని కుడతాయి తేనెటీగలు.
3 చూసిరా అంటే రాసి చూసేది.
4. వంగుడిలో వైద్యానికి పనికొచ్చేది.
5. స్వప్నం వరంలాంటి దమకుంటే తత్తరపాటు కలుగుతుంది.
7. ఎర్రని పువ్వు.
8. అప్పుడప్పుడు చేను మేసేది.
11. విష్ణుమూర్తి కుమారుడు.
12. పూలదండగల తలలో స్వర్గంగా ఉండేది.
16. ఆయాసము లేకుండా దాసి దొరుకుతుందా?
17. "వారీ వారీ నడుమ మురారీ" ఉండి చేసే నాట్యం.
19. కోనుక్కున్న సేవకుడు.
20. మనుచరిత్రంలో మనసును రంజింపజేసే నాయిక.
21. నిజాము సంస్థానంలో ఉన్న కొలం
24. తినగా తినగా యిది తియ్యగా ఉంటుంది
25. రామునితో కలిసివున్న ఋషి.

## 3-వ నుడికట్టుకుజవాబులు

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 సి | రి | ■ | 2 వి | 3 డి | 4 ది | ■ | 5 | 6 ల |
| గ | ■ | 7 ఏ | డు | కొం | డ | లు | ■ | త |
| ■ | 8 భా | ■ | పు | ■ | ఆ | ■ | 9 రా | ■ |
| 10 వా | గ | 11 ను | ■ | ■ | ■ | 12 జ | మా | 13 ను |
| 14 ర | వ | ర | వ | ■ | 15 అ | న | య | ము |
| 16 ము | త | గ | ■ | ■ | ■ | 17 ము | ణ | క |
| ■ | ము | ■ | 18 చ | ■ | 19 పా | ■ | ము | ■ |
| 20 సా | ■ | 21 గా | లి | 22 గో | పు | రం | ■ | 23 త |
| 24 గు | రి | ■ | 25 ది | గు | లు | ■ | 26 మా | ల |

## కథావినోదం

రచన : వి. ఆర్. భావరాజు.
ప్రకాశకులు : వి. ఆర్. భావరాజు, కాకినాడ. వెల రు 1-4-0 పేజీలు 132.

ఇందులో 6 కథలున్నవి. ఇది కొత్త రకమైన రచనలాగా వుంది. గమనించాల్సిందేమంటే- ప్రేమ, ఎవరో ఎవరోన్ని తీసుకొనిపోవడం, పెళ్ళిచేసుకోవడం, లేకపోతే ప్రాణాలు తీసుకోవడం ఇటువంటి కథలు లేవు. ఈ పుస్తకంలో సంసార పక్షమైన కథా వస్తువును తీసుకొని నవ్వొచ్చేట్టుగా, హాస్యంకనపడకుండా, సహజత్వానికి లోపం లేకుండా ప్రసాద గుణంగల శైలితో రాశారు.

"తెగులు కుదిరింది!" బలే బాగుంది. చదువుకున్నపిల్లల డొంక తిరుగుడు సమాధానాలు, ఎట్లా వుంటాయో శోభ సమాధానాలవల్ల తెలుస్తుంది. కాని ఆ చదువుకొన్న తనంలో వున్న అహంభావం, స్వార్థం అనేవి త్యాగం, ఔదార్యం కన్నా రాకు లోబడ— బావ చదువులో వెనకబడినా, చివరకు బావనే చేసుకుంటానంటుంది శోభ.

"చెట్టుక్షమించవు!" అనేకథలో మాంసాహారమే మంచిదని చెప్పిస్తూవున్న వాదం చాలా చక్కగావుంది. ఆ తర్కంలో నే వుంది హాస్యం గాని, చమత్కారంగాని. "అములకొక్కడ ముక్కల కేస, నీప్లేట్లో అన్నం కేసి ఓసారి చూడు. అందులో ఒక్కొక్క గింజా తల్లికడుపున ఎంత ఆప్యాయంగా పుట్టి, ఎంత గారాబంగా పెరిగిందో ఈ నాటితో నీ పాపిష్టి ఆకలికి బలవ్వకపోతే ఒక్కొక్క గింజా...ఆలోచించావా ?" అంటాడు వాదంలో. కుఱ్ఱాడికి గాబరావేసి చెమటలు కూడాపోస్తాయి పాపం, "సింహాద్రి మీద" అనే దానిలో మేష్టారు అంటారు. "దేముడుమీద నమ్మకం అనేది మనిషికి ప్రపంచానికి మధ్య తెర...క్షమించడు, పైగా పగ సాధిస్తాడు" దణ్ణాలనుగురించి చివరకు మానవుడు సుందర రూపాయ అణా పైసలు లెక్కపెట్టుకుని తర్వాత ముక్తిమార్గం ఆలోచిస్తాడనేవాదాన్ని రక్తికట్టేట్టుగా చిత్రిస్తారు.

"గయ్యాళియం"లో కొంతవరకు భార్యాభర్తలమధ్య వుండే విపరీతచర్యలు. కలహాలు, పోట్లాటలు ఏకరువు పెట్టారుగాని "శ్రుతిమించి రాగాన పడ్డదేమో"నని పిస్తుంది చివరకు. ఏమంటే సాక్షాత్తు భర్తను అతని స్నేహితునిఎదుట ఇక్కడ చిత్రించినట్లు చెవులు పిండిరేపోననే వూహా వస్తుంది. కాని కథ చదువుకొని ఆనందించకపోరు.

తెలుగులో హాస్యం వొలుకుతూ చదవడానికి సరదాగా చిన్న చిన్న కథలు రాసేవారు చాలా తక్కువ. వారిలో ముఖ్యంగా మునిమాణిక్యంగారు, మొక్కపాటివారు జ్ఞప్తికి వస్తారు. శ్రీ భావరాజుగూడా ఆ శ్రేణిలోకి రావడానికి అవకాశంవుంది. ఇంకా ఇటువంటివి—అందులో ముఖ్యంగా చిన్న చిన్నవి రాసి ఆంధ్రరచనకు మెరుగు పెట్టగలరని ఆశించవచ్చు. ఈ కథల్లో హాస్యం నవ్వు, కథావస్తువు—అందరినీ ఆకర్షించేవే.

"రా. మూ."

Printed and Published for Nageswara Rao Estates (Private) Ltd. by S. Radha Krishna at The Andhra Patrika Press. 6 & 7, Thambu Chetty Street, Madras-1. Editor S. Sambhu Prasad.




స్టూడియోస్
శ్రీ సారథి
(హైదరాబాద్)

సావిత్రి · రాజసులోచన...
రేలంగి · జగ్గయ్య · బాలయ్య పెరుమాళ్లు
సూర్యకాంతం నిర్మల